# బాలల బొమ్మల నెహ్రూజీ





కథ
బూరెలసత్యనారాయణమూర్తి

అలంకరణ
బలరామాచార్య

ప్రకాశకులు
చందానారాయణశ్రేష్ఠి
సికిందరాబాదు. హైదరాబాదు.



భారతరత్న

భారత భాగ్య విధాత, ప్రపంచ ప్రజానాయకుడు,
స్వాతంత్ర్యరథ చోదకుడు, త్యాగమూర్తి, విజ్ఞాన ఖని,

మన ప్రధాని

**పండిత, జవహరులాల్ నెహ్రూ**

## అంకితము

భారతమాత ముద్దుకుమారుడు,
భారత జాతీయ స్వాతంత్ర్యవీరుడు,
ప్రపంచ ప్రజానాయకుడు,
ప్రజాకోటి ఆప్తమిత్రుడు,
దేశసేవా ధురంధరుడు,
రాజకీయతంత్రజ్ఞుడు,
విజ్ఞానయశోభాస్కరుడు,
సద్గుణ సంపన్నుడు,
మహాపురుషుడు

అయిన

**పండిత, జవహరులాల్ నెహ్రూజీకి.**

# ప్రకాశకుల మనవి

ప్రపంచ నాయకులలో అగ్రగామి, ధర్మ సంరక్షణార్థియు, దేశసేవా తత్పరుడు, త్యాగమూర్తి, భారత రత్న, విజ్ఞాన ఖని యగు పండిత జవహరు లాలు నెహ్రూజీ జీవిత చరిత్ర యిది.

ఇట్టి ప్రజా నాయకుడగు పవిత్రమూర్తి కథను బాలలకు తెలియజేయుట మా ధర్మమని నిర్ణయించు కొన్నాము. దేశసేవా తత్పరుడగు జవహరుడు బాలల కాదర్శప్రాయుడు కాగలడని మా విశ్వాసము.

అందువలన బాలల కందుబాటులో నుండునట్లు సరళమైన భాషలో శ్రీ బూరెల సత్యనారాయణ మూర్తిచే నీ గ్రంథమును వ్రాయించితిమి. చిత్రకారు లగు శ్రీ మడిపడగ బలరామాచార్యులచే రచనకు దగిన చిత్రరచన గావించితిమి; చక్కని బైండుతో బాలల కందజేసితిమి.

మా యీ కృషికి బాలబాలికలే గాక, విద్యాధి కారులును దోహద మొసంగుదురని ఆశించుచున్నాము.



ప్రకాశకులు :
చందా నారాయణ శ్రేష్ఠి.


గ్రంథకర్త:

# మనవి

శ్లో॥ "యదా యదాహి ధర్మస్య । గ్లానిర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య । తదాత్మానాం సృజామ్యహమ్
పరిత్రాణాయ సాధూనాం । వినాశాయ చ దుష్కృతమ్
ధర్మ సంస్థాప నార్థాయ । సంభవామి యుగే యుగే॥"

అని శ్రీ కృష్ణపరమాత్మ తెలియజేసినాడు. ఎప్పుడెప్పుడు ధర్మమునకు నాశము సంభవించుచుండునో, అప్పుడప్పుడు ధర్మసంస్థాపనార్థమై భగవానుడవతరించి, సజ్జనులను కాపాడును; దుర్జనులను శిక్షించును.

పూర్వకాలమందు నర-నారాయణుల వలె, ద్వాపర యుగమం దవతరించిన శ్రీకృష్ణార్జునులవలె, ఈ యుగమునందు శ్రీ గాంధి-నెహ్రూలు జన్మించినారు. ప్రపంచమునందు నూతన కాంతులు వెదజల్లుచు, ధర్మ సంరక్షణకై నిరంతర కృషి చేసినారు; దీనజనసేవ గావించినారు. ప్రపంచ ప్రజాకోటికి, నాయకులకు ఆదర్శ ప్రాయులై అమరజీవులైనారు. ఇట్టి పుత్రి రత్నములను కన్న మన భారతమాతకు ధన్యవాదములు.

ప్రజలలో, ప్రజాపాలకులలో ఐకమత్యము లేని కారణమున వందలాది సంవత్సరములుగా మన భారత జనయిత్రి విదేశరాజుల పెత్తనాలకు గురియై దాస్యము చేసినది. కన్నతల్లి పరులకు దాసియై కుములుట గని పుత్రులు భరింపజాలరు కదా!

విదేశీయుల పాలనలో మన భారతజనయిత్రి అష్టకష్టములకు గురియైనది. మన దేశీయుల బాధ వర్ణింపరానిది. అందువలన— విదేశీయుల పైశాచిక కృత్యముల నన్నిటిని అరికట్ట దలచి— కొందఱు బుద్ధిమంతులు, త్యాగమూర్తులు ముందుకు వచ్చినారు. "అఖిల భారత జాతీయ కాంగ్రెస్" అను సంస్థను స్థాపించినారు. ఈ సంస్థలో జాతి, మత, కులభేదములు లేవు. హిందువులు, మహమ్మదీయులు, విదేశీయులు "భాయి, భాయి" అని చేతులు కల్పుకొన్నారు. ఏక కంఠంతో ఏక మనస్సుతో నిలబడి, సంస్థగౌరవము కాపాడినారు.

విశ్వవిఖ్యాతి నార్జించిన — తిలక్, గోఖలే, మదన మోహన మాళవ్యా C. R. దాస్, లజపతిరాయ్, బిపిన్ చంద్రపాల్, మహమ్మదాలీ, షౌకతాలీ, కొండా వెంకటప్పయ్య పంతులు, రామదండు దుగ్గిరాల గోపాల కృష్ణయ్య మున్నగు భారతీయ సోదరవీరులు ఎనలేని కృషి చేసి సంస్థగౌరవమును కాపాడినారు; భారతమాత దాస్యము తొలగించుటకు విశ్వప్రయత్నములు చేసినారు.

కానీ, మన దేశీయులలో నైకమత్యము లేనందువలన, అపారమగు నౌకాబలము, ఆయుధబలము, అంగబలము, అర్థబలమూ గల ఆంగ్లేయుల నెదిర్చి పోరాడుటకు తగిన శక్తి లేక మన కాంగ్రెసువీరులు యెన్ని ప్రయత్నములు చేసినను వృథా కాజొచ్చినవి. తమ ప్రయత్నములు "బూడిదవోసిన పన్నీరు" అగుచుండుటకు— తగిన మార్గము తోచక మన నాయకులు నిరాశ పొంది నింగి చూడసాగారు.

అట్టి తరుణంలో మన "నవభారత పిత, శాంతిదూత" అగు మహాత్మా గాంధీ (మోహనదాస్ కరంచంద్ గాంధి) ఆలనాడు పాండవులకు శ్రీకృష్ణుడు తోడ్పడి

నట్లు— మన వీరుల కానాడు బాసట యైనాడు. "సత్యము, అహింస" అను నాయుధములను ధరించినాడు ; భారతమాత దాస్యము తొలగించుటకు పూనుకొనినాడు.

మహాత్మాజీ దేశము నంతటినీ మేల్కొలిపినాడు. భారత ప్రజలలో - "ఐకమత్యము, సత్యము, సహనము" చాల అవసరమని ప్రకటించినాడు. కులమత భేదములు పనికిరావని ఉద్ఘోషించినాడు. అస్పృశ్యతను రూపుమాపుమన్నాడు. విదేశీ సరుకులను బహిష్కరించి, స్వదేశీ వస్తువులను మాత్రమే ఉపయోగింపుమన్నాడు. స్త్రీ పురుషు లెల్లరును రాట్నములపై నూలు తీసి, విధిగా ఖద్దరు దుస్తులనే వాడమని ప్రబోధించినాడు. హింస కూడదన్నాడు ; సత్యం తప్పవద్దన్నాడు, ధర్మమే జయమన్నాడు. ఇట్టి సద్గుణాలు, సదాశయాలు ఉన్న పదిమంది నాయకులైనా సరే భారతమాత దాస్యము తొలగించుటకు చాలు నని వెల్లడించినాడు.

యుద్ధం చేయకుండా స్వాతంత్ర్యం సంపాదించుట అసంభవమని కొందరు నాయకులు - అహింసావిధానంపై నమ్మకం లేనివారు - గాంధీకి నాయకత్వము నంగీకరింపక, సంస్థనుండి తొలగిపోయారు. కొందఱు విశ్వసించారు. నేటి మన దేశ పరిస్థితులకు గాంధీ సిద్ధాంతములు తగియున్నవని గ్రహించారు. అట్టివారిలో పేర్కొనదగినవారు :

పండిత మోతీలాల్ నెహ్రూ, రాజేంద్రప్రసాదు, జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభభాయి పటేలు, డాక్టరు పట్టాభి, మౌలానా ఆజాద్, సుభాస్‌చంద్రబోస్, సరోజినీ దేవి, టంగుటూరి ప్రకాశం పంతులు, బులుసు సాంబమూర్తి, విశ్వదాత నాగేశ్వరరావు పంతులు, ఖాన్ అబ్దుల్ గఫ్ఫార్, మొదలగువారు. వీరందరును గాంధీ అడుగుజాడల్లో నడుస్తూ దేశసేవకు నడుం బిగించారు. అహింసా పద్ధతులలో "శాసనోల్లంఘనం, సత్యా

గ్రహం" మున్నగు మహత్తర ఉద్యమాలను జయప్రదంగా నడిపించారు; ప్రజలకు సౌకర్యాలు కలిగించారు.

ప్రపంచంలో హింసాపద్ధతులను అవలంబించకుండా తమ కోర్కెలను తీర్చుకొన్న దేశములు లేవు. అహింసా విధానముతో స్వాతంత్ర్యం సంపాదించుకొన్న గౌరవం భారతదేశానికే లభించినది. ప్రపంచములో గల అన్ని దేశాలవారు నివ్వెరపోయారు. గాంధీ - నెహూ్రల నాయకత్వమును ప్రశంసించారు. దేశదేశాలలో గాంధీ - నెహూ్రల పవిత్రాశరములు మార్మ్రోగసాగాయి. "గాంధీ - నెహూ్రలు భారతీయులకు మాత్రమే గాక, పీడిత ప్రజాకోటి కంతటికిని ఆత్మబంధువు లనియు, ఆదర్శమూర్తులనియు, ఆదర్శప్రాయులైన మహాత్ములనియు" మెప్పు పొందారు.

క్రమంగా గాంధీజీ చెప్పినట్లు చేయుటకు కోట్లకొలది భారతీయులు సిద్ధమయ్యారు. ఇది గ్రహించినారు ఆంగ్లేయులు. "గాంధీజీకి యిష్టము లేకుండా మనము భారతభూమిలో నిల్వలేము; నిల్చిన క్షేమము కూడా లేదు. అని తెల్లవారు సత్యాన్ని గుర్తించారు. 1947 ఆగష్టు 14 వ తేదీనాడు గాంధి - నెహ్రూలకు భారతదేశ పరిపాలన నప్పగించి తమ దేశానికి వెళ్ళిపోయారు. అందువలన మన దేశానికి 1947 ఆగష్టు 15 వ తేదీనుండి స్వాతంత్ర్యము లభించింది; చెఱ తొలగిపోయింది. కనుకనే ప్రతి సంవత్సరము ఆగష్టు 15 వ తేదీ మనకు పర్వదినమై ఆనందము కలిగించుచున్నది.

ఈ విధంగా మన దేశానికి స్వాతంత్ర్యం సంపాదించిన మహాపురుషుడు గాంధీ - తాను ఏ విధమైనట్టి పదవినికూడ వాంఛించక, రక్షణ భారమంతయు, సమర్థుడు, ప్రియ శిష్యుడు అగు జవహరులాల్ నెహ్రూకు అప్పగించాడు. ఆనాటినుండి నెహ్రూ మన దేశానికి మహామంత్రియై దేశాభ్యుదయానికి నిరంతర కృషిచేసి ఉన్నత స్థితిలో నిల్పాడు.

నెహ్రూకంటె పెద్దలైన అనుచరులు అనేకమంది ఉన్నారు. ఐననూ గాంధీజీ దేశరక్షణ భారము నెహ్రూపై ఉంచుటకు కారణ మేమి? ఆయనకు గల గొప్ప తన మేమి? అసలు ఈ నెహ్రూజీ ఎవరు? ఎక్కడ జన్మించినాడు? ఎంతవరకు చదువు కున్నాడు? నెహ్రూ వంశ మేది? ఆయన చేసిన ఘనకార్యాలు ఏవి? త్యాగగుణ మెట్టిది? అను విషయాలు ఈ గ్రంథములో బాలబాలికలకొరకై తెలియజేయబడినది. కావున ఆయన జీవిత చరిత్ర అంతా చదివి, ఆనందించండి! దేశ వీరులుగా తయారు అవండి! బాపూజీ అడుగుజాడలలో నడిచి, విశ్వమంతటా విశ్వవిఖ్యాతి నందిన భారతజ్యోతి మన నెహ్రూ. నెహ్రూ అడుగుజాడలలో నడచి, కనీస మొక దేశభక్తుడుగా నయినా తయారగుట భావి పౌరులుగు మీబోటి బాలల విధి. కావున మీకై నెహ్రూ జీవిత చరిత్రను మీకు తెలియు లాగున ప్రకాశ మొనర్చితిని. కావున నెహ్రూ ఆశయాలను అర్థముచేసికొనండి! భారత దేశ ప్రతిష్ఠను పెంపొందించండి! దేశ విదేశాలలో పేరు ప్రఖ్యాతులను పొందండి.

"పెద్దల నుడులకు నే సం
బద్ధుడనై పదములల్లి, బాలలకొరకై
ముద్దుగ( గూర్చితి నిట్లు; సు
బుద్ధుల యాశీస్సులంది ముద మలరంగన్".

7638, కలాసిగుడ,
సికిందరాబాదు.

ఇట్లు
గ్రంథకర్త: బూరెల సత్యనారాయణమూర్తి

# బాలల బొమ్మల నెహ్రూజీ

## నెహ్రూజీ వంశము - రాజకౌలు

మన భారతదేశానికి ఉత్తరంగా ఉన్న హిమాలయ పర్వతప్రాంతం ప్రకృతి సౌందర్యానికి పుట్టిల్లు అని ప్రఖ్యాతి గాంచినది. ఆ పర్వతాలకు పడమటి దిక్కున ఉన్నది కాశ్మీరు దేశం.

ఈ కాశ్మీరు దేశమే నెహ్రూ వంశీయులకు జన్మస్థానం. ఈ వంశమువారు సద్బ్రాహ్మణులు; పండితులు. వేదము నాకళించిన మేధావులు; నిత్యాగ్నిహోత్రులు, పవిత్రులునై అలరారినవారు.

నెహ్రూ పూర్వులలో "రాజకౌలు" అను పండితుడు కాశ్మీరు సంస్థానములో పండితుడుగా ఉండి, అఖండమైన ఖ్యాతిని ఆర్జించాడు. మొగలుచక్రవర్తులలో ఆఖరివాడగు "ఫరూక్‌షియార్" అను చక్రవర్తి ఒకసారి కాశ్మీరుదేశానికి వచ్చాడు! (1716). అతడు అక్కడి ప్రకృతిసౌందర్యాన్ని తిలకించి ఎంతో మురిసిపోయాడట! ఆ ఆనంద సమయంలో చక్రవర్తి రాజకౌలు ప్రతిభా విశేషాలను విని, స్వయముగా ఆయన చతురోక్తులు విని ఎంతో ఆనందించినాడు! అంతటితో పోనీక చక్రవర్తి రాజకౌలును గౌరవించి "తమరు మా దర్బారులో ఉన్న పండితబృందములో ఒకరై మాకు ఆనందాన్ని కలిగించండి!" అని వేడుకొన్నాడు! రాజకౌలు "తప్పక చక్రవర్తి ఆజ్ఞను శిరస్సున దాల్తు"మని వాగ్దానము గావించాడు!

## రాజకౌలు - ఢిల్లీ నివాసము

ఆ తరువాత కొద్ది దినాలకే రాజకౌలు చక్రవర్తి ఆహ్వానంపై కుటుంబ సహితముగా ఢిల్లీ నగరానికి చేరుకొన్నాడు. చక్రవర్తి ఆనందించి, రాజకౌలును సత్కరించి తన దర్బారులో పండితునిగా నియమించాడు. అంతేగాక, తన పిలుపుతో సకుటుంబముగా వచ్చినాడను ఆనందంతో చక్రవర్తి - రాజకౌలుకు ఒక జాగీరును, యమునా నదీతీరమున ఒక చక్కని భవనాన్నికూడ యిచ్చి సన్మానించాడు. ఆ రోజు మొదలు రాజకౌలు ఢిల్లీపట్టణంలో స్థిరనివాసి అయాడు. ఆయన, దర్బారులో అలరారుటయేగాక చక్రవర్తి బిడ్డలకు సంస్కృతము, ఫార్సీ మొదలగు భాషలను నేర్పుచుండెడివాడు.

"నహర్" అనగా కాలువ అని అర్థము. రాజకౌలు కాలువయొద్దున గదా కాపురము ఉన్నది ? అందువల్ల ప్రజలందరును రాజకౌలు వంశీయులను నహరు లని పిల్చెడివారు. కాలక్రమమున ఆ 'నహర్' అను శబ్దము 'నెహ్రూ'గా మారిపోయినది. ఈ విధముగా రాజకౌలువంశీయులు నెహ్రూలుగా పిలువబడుచు ఢిల్లీనివాసు లయారు.

రాజకౌలు అనంతరం వారి వంశంలో నుండి సౌభాగ్యలక్ష్మి తొలగిపోయింది. జాగీరు చెయిదాటిపోయింది. భవనం నామమాత్రంగా నిలిచింది. అందువల్ల నెహ్రూ వంశీయులలో లక్ష్మీనారాయణనెహ్రూ (మన జవహర్‌లాల్‌నెహ్రూ ముత్తాతగారు) చక్రవర్తి ఆస్థానములో న్యాయవాదిగా కాలం గడపవలసి వచ్చింది.




ఢిల్లీ చక్రవర్తి దర్బారులో రాజకౌలు

లక్ష్మీనారాయణ నెహ్రూ కుమారుడు గంగాధర నెహ్రూ. ఈయన కొంత కాలము ఢిల్లీ నగరంలో కొత్వాలుగా పనిచేశాడు. ఆ సమయంలోనే మన భారతదేశ పరిపాలన పూర్తిగా ఇంగ్లీషువారికి చేజిక్కింది.

## 1857 సిపాయీల యుద్ధం

ఆ తరువాత కొంతకాలం గడిచింది. ఆంగ్లేయుల పరిపాలనతో ప్రజలకు అనేక కష్టాలు కలిగాయి. ఇంగ్లీషువారు మన భారతీయులను మూర్ఖులనీ, పశువులనీ, అడవి మనుష్యులనీ భావించి - నిరసనగా చూచేవారు. వారి పాలన రాను రాను మన భారతీయులకు భరింపరానిదైపోయింది. దేశమంతటా అశాంతి ప్రబలిపోయింది. ఇంగ్లీషువారికి మన శక్తి రుచి చూపించాలని భారతీయ వీరులగు కొందరు సిపాయీలు ఇంగ్లీషువారిని ఎదుర్కొన్నారు. ఈ యుద్ధము 1857వ సంవత్సరములో ప్రారంభమై రెండేండ్లు సాగినది. దీనికే 'సైనిక విప్లవ' మని పేరు వచ్చింది.

భారతదేశ స్వాతంత్ర్యమునకై పాటుపడిన మన వీర సిపాయీలకు తగినంత ఆయుధబలం, ప్రజాబలం లేకపోయింది. అందువలన మన సిపాయీలు, దేశభక్తులు, త్యాగమూర్తులు చేసిన ప్రయత్నాలన్నీ బూడిదపోసిన పన్నీరయినవి. మన భారత జాతి దురదృష్టమువల్ల ఆ యుద్ధంలో పరాక్రమవంతు లగు తాంతియా తోపే,


ఝాన్సీ లక్ష్మిబాయి

నానాసాహెబు, ఝాన్సీ లక్ష్మిబాయి వంటి భారత జాతి రత్నాలు మనకు కాకుండా పోయినారు.

ఈ సైనిక విప్లవంతో ఢిల్లీ పట్టణములో అశాంతి ప్రబలిపోయింది. ప్రజలను చూచి ప్రభుత్వమూ, ప్రభుత్వాన్ని చూచి ప్రజలు మిక్కిలి భయపడ్డారు. ఇట్టి పరిస్థితులలో ఢిల్లీలో ఉండుట ఏమాత్రం క్షేమం కాదని, అనేక కుటుంబాలు ఢిల్లీ వదలిపోయినవి. ఆ సమయంలోనే గంగాధర నెహ్రూ కూడ తన కుటుంబముతో ఢిల్లీ నగరము విడిచి ఆగ్రా పట్టణానికి చేరుకొన్నాడు.

గంగాధర నెహ్రూకు ముగ్గురు కుమారులు. వారు : (1) వంశీధర నెహ్రూ, (2) నందలాల్ నెహ్రూ, (3) మోతీలాల్ నెహ్రూ అనువారు. ఇందు మొదటివాడగు వంశీధర్ నెహ్రూ బ్రిటిష్ ప్రభుత్వ న్యాయశాఖలో ఉద్యోగము చేసేవాడు. రెండవవాడు నందలాల్ నెహ్రూ కొంతకాలము 'ఖేత్రి' అను సంస్థానమున దివాన్ (మంత్రి)గా నుండి అటు పిమ్మట ఆగ్రానగరంలో న్యాయవాద వృత్తి నవలంబించి మంచి పేరు గడించుకొన్నాడు.

మోతీలాల్ నెహ్రూ గర్భములో నుండగనే గంగాధర్ నెహ్రూ మరణించాడు. అందువలన మోతీలాల్ సంరక్షణ భారమంతయు చిన్నన్న యగు నందలాల్ నెహ్రూ వహించాడు; తమ్మునికి తండ్రిలేని లోటు రానీయకుండా గారాబంగా పెద్దజేశాడు.

మోతీలాల్ నెహ్రూ చిన్నతనంనుండీ మంచి తెలివితేటలు కలవాడు. పండ్రెండేండ్లకే అతడు పార్సీ, అరబ్బీ, హిందుస్తానీ భాషలు చక్కగా అభ్యసించినాడు; పదునారవయేట ఎంట్రన్సు పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు.

ఇంతలో నందలాల్ నెహ్రూ పనిచేయుచున్న ఉన్నత న్యాయస్థానము ఆగ్రానగరమునుండి అలహాబాదు పట్టణానికి మార్చబడింది. అందువల్ల నందలాల్ నెహ్రూ కుటుంబంకూడ అలహాబాదు చేరవలసి వచ్చింది. అప్పటినుండి నెహ్రూలకు అలహాబాదు స్థిరనివాస మయింది.

మోతీలాల్ నెహ్రూ అలహాబాదు కళాశాలలో చేరి, బి.ఏ; వరకు చదివాడు. కానీ, పట్టభద్రుడు కాలేకపోయాడు. అయినా, అతడు పట్టుదల, ధైర్యము విడువక న్యాయశాస్త్రము చదివి - ప్రథమశ్రేణిలో విజయం పొందాడు. కాన్పూరు న్యాయస్థానంలో మూడేండ్లు అనుభవం సంపాదించుకొన్నాడు. ఆ పిమ్మట అలహాబాదు న్యాయస్థానమున వకీలుగా వృత్తి నారంభించాడు.

ఆయన చేపట్టిన కేసులకు అపజయమే లేకుండపోయినది. అందువలన ఆయన పట్టణవాసులచే మిక్కిలి ప్రశంసింపబడినాడు. మోతీలా లిట్లు న్యాయముతో, సంవత్సరానికి 4, 5 లక్షల రూపాయల నార్జించేవాడు.



# ఆనంద భవనము

ఈ సమయములోనే మోతీలాల్ నెహ్రూ అలహాబాదు పట్టణములో ఒక సుందర భవనమును, దానికి దగ్గరగానే ఒక చక్కని కొలనును నిర్మింపజేశాడు. ఆ భవనము యిప్పటికిని 'ఆనందభవన' మను పేరుతో అలరారుచు నేత్రానందకరమై

యున్నది. మోతీలాల్ తఱచు 'ఆనందభవనము'లో విందులు చేస్తుండేవాడు; వినోద ప్రదర్శనములు జరిపించేవాడు. అందువలన ఆనందభవన మెప్పుడు చూచినను ఆనంద మయమై కలకలలాడుచుండేది.

పండిట్, మోతీలాల్ నెహ్రూ ఖ్యాతిగాంచిన న్యాయవాదిమాత్రమే కాదు. గొప్ప రాజకీయవేత్త. ప్రాచ్య పాశ్చాత్య సాంప్రదాయములు రెండింటిని చవి చూచిన గొప్ప వ్యక్తి. దేశాభిమాని. సంస్కారప్రియుడు. పాతకాలపు మూఢనమ్మకాలను, ఆచారములను పాటించేవాడు కాదు. (అట్లని భగవంతుడు లేడనివాదించేవాడు కాదు.) తమ వంశమందు అనాదిగా వస్తున్న 'ఘోషా' పద్ధతిని మాన్పించివేశాడు. కుల, మత, జాతి భేదములను పాటించేవాడు కాదు. హిందూ ముస్లిములను సమానముగా చూచేవాడు. ప్రజాహిత కార్యములలో పాల్గొనుచుండెడివాడు.

## జవహర్ జననం

మోతీలాల్‌నెహ్రూ భార్యపేరు స్వరూపరాణి. ఆమె సుగుణవతియే గాక, చక్కనిచుక్క. పతికి దగిన సతి. ఈ దంపతులకు వారు చేసిన పూర్వపుణ్యఫలితంగా 1889వ సంవత్సరము నవంబరు 14వ తేదీని మన కథానాయకుడు జవాహర్‌లాల్ నెహ్రూ జన్మించినాడు. సిరిసంపదలతో తులతూగుచున్న ఆ పుణ్యదంపతులకు మగ బిడ్డ తొలిసారిగా జన్మించినందుకు వారెంతో ఆనందించారు. వారు ఆ ఆనందసమయములో వేలాది పేదజలకు అన్నదానము చేయించినారు. వస్త్రదానం విరివిగా చేయించి



ఆరు మాసముల జవహర్

నారు. తమ ఆనందభవనానికి అలంకార ప్రాయమగునట్లు శిశువునకు 'జవహర్' అని పేరు పెట్టారు. జవహర్ అనగా అమూల్యమగు 'వజ్ర'మని అర్థము.

'బుద్ధికి బృహస్పతియై, త్యాగమున కర్ణుడై, పట్టుదలకు భగీరథుడై, భారత జాతి రత్నమై, ప్రపంచ నాయకుడై, అలరారు గాత!' యని శిశువు నామకరణమునాడు పెద్దలందరూ దీవించారు. వారి యాశీస్సులు వృథాపోలేదు. అక్షరాలా వారి దీవెనలు ఫలించాయి.

## జవహర్ బాల్యము

సకల సంపదలతో తులతూగుచున్న మోతీలాల్ నెహ్రూ ఏకైక పుత్రుడు జవహర్‌లాల్ నెహ్రూ. అతని కేది కావలయునన్నను తల్లిదండ్రులు తక్షణం సమకూర్చి ఇచ్చేవారు. అందువలన అగర్భశ్రీమంతుడగు మన జవహర్ బాల్యజీవిత మతి సుకుమారంగా, గారాబంగా గడిచిపోయింది.

చిన్నతనమున జవహరుతో ఆడుటకు తగిన పిల్లలు ఎవరూ లేరు. అందువల్ల జవహర్ తండ్రివద్ద పని చేసే ముబారక్ ఆలీతో యెక్కువ కాలం గడిపేవాడు. ముగ్గుబుట్టలా నెరిసియున్న ముబారక్ గడ్డం చూచి జవహర్ ఎంతో మురిసిపోయేవాడట! ఆయన చిట్టిజవహర్‌కు ఎన్నో చిత్ర విచిత్రమైన కథలు చెప్పి ఆనందపరిచే వాడు. అందువల్లనే జవహర్ మున్షీ ముబారక్‌ను విడిచి ఉండలేక పోయే వాడు.



## వటువుగా జవహర్‌లాల్

జవహరుకు అతని ఎనిమిదవ యేట ఉపనయనం జరిగింది. బలిచక్ర వర్తిని ఆశించవచ్చిన వామన మూర్తిలా తయారయిన జవహరు వటువును చూచి తలిదండ్రులే గాక

బంధువు లంతా ఎంతో మురిసిపోయారు. ఈ రీతిగా ఏదో ఒక వేడుకతో జవహరులాలు బాల్యం ఆనంద మయంగా సాగిపోతూ ఉండేది.

## జవహర్ దొంగతనం - పొందిన ఫలితం

చిన్నతనంలోనే జవహరుకు పెన్‌తో వ్రాయాలని కోరిక కలిగింది. తండ్రి వద్ద మంచి ఖరీదు గల పెన్నులు రెండు ఉన్నవి. అయితే, ఆయన చాల కోపం గల వాడు. మోతీలాల్ అంటే పెద్ద పెద్ద వాళ్లకే భయం. ఇక జవహర్‌సంగతి చెప్పాలా? జవహర్ చిన్నతనంలో చాల అల్లరి చేసేవాడు కూడ. తండ్రి ఇంటిలో ఉన్నంతసేపూ పిల్లిపిల్లలా ఉండేవాడు. ఇంటినుండి తండ్రి బయటకు వెళ్లాడా? జవహర్ సింహం పిల్లలా తిరిగేవాడు. ఎవ్వరూ ఆతనికి అడ్డువచ్చేవారు కాదు. ఏ భయము చెప్పినా ఒక్క-తండ్రి మాత్రమే,

జవహరుకు ఎప్పుడైతే పెన్నుతో వ్రాయాలని బుద్ధిపుట్టిందో - ఆ వెంటనే దానిని సంపాదించుటకు ఎత్తువేశాడు. తండ్రిని అడిగితే ఒకటి కాదు; పది పెన్నులూ వస్తాయి. కానీ, అడుగుటకు ధైర్యమేదీ? అందువల్ల మెల్లగా తండ్రి గదిలోకి పిల్లి లాగా దూరాడు. టేబిలుమీద ఉన్న రెండు కలాలలోను ఒక కలాన్ని తీసికొని చల్లగా తన గదిలోకి దూరాడు; తన పెట్టెలో దాచుకున్నాడు. తరువాత కొంతసేపటికి మోతీ లాల్ నెహ్రూ వచ్చి, చూచుకొన్నాడు. టేబిలుమీద ఒకటే పెన్ను ఉంది. ఇంటిలో ఉన్న అందరినీ అడిగాడు; మేం తీయలేదని అందరూ అన్నారు. జవహరును



పిలిచి అడిగినాడు. 'నాకేం తెలియదని అబద్ధ మాడాడు జవహర్. 'ఎవరూ తీయకపోతే కలం దానంతట అది మాయమై పోతుందా? దానికి రెక్కలు లేవుగా ఎగిరిపోవడానికి? వెదకండి. ఇంటిలోఉన్న బీరువాలూ, బల్లలూ' అని గర్జించాడు మోతీలాల్ నెహ్రూ.

ఆ గర్జనకు ఇంట్లో ఉన్న నౌకరులు గజగజవణికిపోయారు. అంతా

వెదక నారంభించారు. తుదకు మోతీలాల్ కంటనే పడింది జవహరు పెట్టెలో ఉన్న పెన్ను. అది చూచి మోతీలాడు ఉగ్రుడై పోయాడు. 'తన కుమారుడే, ఇంత చిన్న తనంలోనే దొంగతనం చేయడం; పైగా - తీయలేదని అబద్ధం చెప్పడం కూడానా?' అని మోతీలాలు చాల మండిపోయాడు. ఇప్పుడే తగిన గుణపాఠం చెప్పకపోతే మున్ముందు జవహర్ మరింత చెడిపోతాడని తలంచి, నిర్దాక్షిణ్యంగా కొట్టాడు జవహరును. ఆ దెబ్బల బాధకు ఆగలేక, జవహరు వెక్కి వెక్కి ఏడుస్తూ తల్లి వెనక్కు చేరాడు.

తరువాత నాలుగురోజులవరకూ జవహరు ఆ దెబ్బల భయంతో జ్వరంవల్ల మంచమెక్కాడు. చేసిన తప్పుపనికి జవహర్ కొన్నాళ్లు తండ్రిముఖం చూడలేక పోయాడు కూడ. దొంగతనంవల్ల చిన్ననాడు తనకు కలిగిన పరాభవాన్ని జవహరులాలు నెహ్రూ తన జీవితంలోనే మరచిపోలేదు.

## జవహరు పుట్టినరోజు పండుగు

ప్రతి సంవత్సరం జవహర్ పుట్టినరోజు పండుగ చాల గొప్పగా చేయించేవారు తల్లిదండ్రులు. ఆ రోజున బంధుమిత్రులను పిలిచి విందులు చేసేవారు. ఆ విందుకు వచ్చే బంధువులు, మిత్రులు జవహరుకు ఎన్నెన్నో కానుకలు యిచ్చి ఆశీర్వదించేవారు. తల్లిదండ్రులవల్లకూడ జవహరు మంచి మంచి విలువగల బహుమతులను పొందేవాడు కూడ.

ఒక సంవత్సరం మామూలు ప్రకారం జవహరు పుట్టినరోజు పండుగ వచ్చింది. జవహరుకు గుఱ్ఱముపై ఎక్కి స్వారీ చేయాలని కోరిక. అప్పటికి అతని వయస్సు 10 సంవత్సరాలు మాత్రమే, ఐనా తండ్రి కొడుకు ఉత్సాహాన్ని మున్షీ ముబారక్ ద్వారా విని యున్నాడు. కాబట్టి చిన్న అరేబియా గుఱ్ఱాన్ని తెప్పించి - ఆ పుట్టిన రోజుపండుగకి బహుమతిగా యిచ్చాడు జవహరునకు. ఆ గుఱ్ఱాన్ని చూచి



పుట్టినరోజు పండుగ బహుమతిపై జవహరు

జవహరులాలు ఎంతో మురిసిపోయాడు. ప్రతి రోజూ పెద్ద వీరునివలె ముస్తాబై గుఱ్ఱము మీద ఠీవిగా కూర్చుని స్వారీ చేస్తుండేవాడు. మున్షీ చెప్పిన అరేబియా కథలలోని నాయకునివలె సాహస కార్యాలు చేస్తూ తానూ ఒక నాయకుడు కావలెనని అనుకొనేవాడు. జవహరుకు గుఱ్ఱపు స్వారీయే కాక, ఈతకొట్టడం, పత్రికలు చదవడం అంటే కూడ మహాయిష్టం.

## తల్లితో జవహరు

జవహరునకు తల్లి దగ్గర గల చనువు ఎంతో అంతకు వందరెట్లు భయ, భక్తులుకూడ ఉండేవి. ''మాతృదేవోభవ'' అని కదా ఆర్యోక్తి, దీనిని సదా మన జవహరుడు పాటించేవాడు. నిత్యం తాను నిద్రనుండి లేవగానే తల్లిని దర్శించేవాడు. నిండయిన ప్రేమతో ఆమె దీవించిన దీవెనను అందుకొనేవాడు. ఆ తరువాతనే తక్కిన పనులన్నీ చూచుకొనేవాడు.



## విజయలక్ష్మి జననం

జవహరు పుట్టిన పది సంవత్సరాలకు అతనికి ఒక చెల్లెలు పుట్టింది. ఆ చెల్లెలే ఈ రోజున మధ్యభారత్‌కు గవర్నరుగా ఉంటూ విరమించుకొన్న విజయలక్ష్మి పండిట్. విజయలక్ష్మి పుట్టుకతో మన జవహరుకు ఒంటరితనం పోయింది. తన కొక చిట్టిచెల్లెలు దొరికినందుకు ఎంతో పొంగిపోయాడు జవహరు. ఆమెతో ఆడుకొంటూ, పాడుకొంటూ ఆనందంగా కాలం గడిపేవాడు జవహరు.

## జవహరు విద్యాభ్యాసము

జవహరుడు ప్రాథమికవిద్య మున్షీజీ(ముబారక్ ఆలీ) వద్దనే అభ్యసించాడు. మోతీలాలుకు తన కుమారుని బడికి పంపించి చదివించాలని ఏమాత్రమూ ఉండేదికాదు. అందువల్ల సమర్థులైన ఉపాధ్యాయులను ఇంటికి రప్పించి - జవహరుకు విద్య నేర్పించే వాడు

జవహరుకు తండ్రి ప్రోత్సాహముతో దివ్యజ్ఞాన సమాజానికి తరుచు తండ్రితో వెళ్ళేవాడు. అక్కడి ఉపన్యాసాలను శ్రద్ధగా ఆలకించుతూ ఉండేవాడు. అప్పటికి జవహరు వయస్సు 12 ఏండ్లు మాత్రమే. దివ్యజ్ఞాన సమాజమునకు అనిబిసెంటు అధ్యక్షురాలుగా ఉండేది. ఆమె జవహరుకు గల ప్రతిభా విశేషాలను గుర్తించి, మోతీలాల్‌నెహ్రూకు నచ్చజెప్పి - ఐర్లండు దేశీయుడగు "బ్రూక్స్" అను పండితుని జవహరుకు గురువుగా ఏర్పాటు చేసింది.

అప్పటి నుండి బ్రూక్సు పండితుడు జవహరుకు ఆంగ్లభాష, భౌతిక శాస్త్రము, రసాయనిక శాస్త్రము మున్నగునవి చక్కగా బోధించేవాడు. అమూల్యము లైన ఎన్నో గ్రంథాలను జవహరుచే చదివించి విజ్ఞానఖనిగా తయారు చేసినాడు.

జవహరుకు 15 ఏండ్లు వచ్చినవి. అప్పటికి జవహర్లాలు ఇంగ్లీషు, పార్సీ. హిందూస్థానీ, సంస్కృతము చక్కగా అభ్యసించాడు. భగవద్గీత, ఉపనిషత్తులు మున్నగు గొప్ప గ్రంథాలను కూడ జవహరు పఠించేవాడు. పురాణకథలు, వీరుల చరిత్రలు అంటే జవహరుకు ఎంతో యిష్టం. వాటిని ,చదివి పొంగి పోయేవాడు. పత్రికలు చదివి, ఎప్పటి కప్పుడు ప్రపంచవార్తలు తెలిసికుంటుండేవాడు; ఆ కాలంలో రష్యా-జపాను యుద్ధం జరుగుచుండేది. ఆ వార్తలన్నీ పత్రికల ద్వారా తెలిసికొం టుండేవాడు. ఆ యుద్ధంలో ఆసియాదేశమగు జపాను పైచేయిగా ఉండం, పాశ్చాత్య జాతికి చెందిన రష్యా ఓడిపోవుచుండడం జవహరుకు ఎంతో ఆనందం కలిగించేది.

అప్పటినుండి 'ఇంగ్లీషువారిని జయించి నా భారతదేశం ఎప్పుడిలా ఖ్యాతి పొందగలదా?' అని ఆలోచించేవాడు. భారతదేశమునకూ, ఆసియా దేశము లన్నిటికి స్వాతంత్ర్యం సంపాదించుటకు తగిన మార్గములు యోచించేవాడు. రష్యావంటి గొప్ప పాశ్చాత్య రాజ్యమును జయించి, ప్రపంచమునకు విశ్రాంతి కలిగించిన ప్రాచ్య దేశ మగు జపాన్ పుట్టుపూర్వోత్తరములు పఠించి తెలిసికొన్నాడు. జపాను వీరుల సాహస కృత్యములకు, దేశభక్తికిని మిక్కిలి అచ్చెరువు చెందాడు. అప్పటినుండి జవహరు

లాల్ నెహ్రూకు జాతీయాభిమానం పెంపొందసాగింది. తమ దేశ స్వాతంత్ర్యమునకు పోరాడిన వీరాధివీరుల కథలను ఎన్నో చదివి - వాటిని తనలో జీర్ణముచేసికొన్నాడు. ఆత్మగౌరవం కొరకు, మాతృదేశ స్వాతంత్ర్యం కొరకు ఎవరయినా యుద్ధం చేస్తున్నా రంటే, వారి దేశభక్తికి, త్యాగానికీ ఎంతో ఆనందించేవాడు. ఈ తలంపులు, ఈ దేశ భక్తి జవహరుకు కలిగిన ఆనాటికి, అతని వయస్సు పదిహేను సంవత్సరాలు మాత్రమే.

## మోతీలాలు యూరఫ్ ప్రయాణము

మోతీలాలు నెహ్రూ చాలవఱకు ఆంగ్ల సాంప్రదాయానికి అలవాటు పడిన వాడు. ఐ.సి.యస్. ప్యాసై తన కుమారుడగు జవహరు కలెక్టరు కావాలని అనుకొనే వాడు. అందుకు తగిన ఉన్నత విద్య కావలయును కదా! అందుకని జవహరును ఇంగ్లండులో చదివించాలని నిశ్చయించుకొన్నాడు. జవహరును ఇంగ్లండు పాఠశాలలో చేర్పించి, తిరిగి స్వదేశమునకు వచ్చునప్పుడు యూరఫ్‌ఖండమున గల ముఖ్య దేశము లన్నీ చూచిరావాలని కూడా తీర్మానించుకొన్నాడు మోతీలాలు నెహ్రూ.

## జవహర్‌లాలు ఉన్నత విద్యాభ్యాసము

ఇట్టి తలంపుతో మోతీలాలు నెహ్రూ 1905వ సంవత్సరములో 'మే' మాస మందు కుటుంబసహితముగా ఇంగ్లాండు దేశానికి బయలుదేరాడు. అచ్చట 'హారో' కళాశాల మంచి ప్రసిద్ధిపొందినది. ఉపాధ్యాయు లందరు మంచి అనుభవము గల విద్యా

వంతులు. సామాన్య కుటుంబముల కా 'హారో' పాఠశాలలో ప్రవేశము లేదు. జమీం దారుల పుత్రులు మాత్రమే అందు చదువుచుందురు. మోతీలాలు జమీందారు కాక పోయినా, మంచి పలుకుబడి గలవాడు ; శ్రీమంతుడు. అందువలన తన పలుకుబడిని వినియోగించి, కొడుకును ఆ పాఠశాలలో చేర్పించగలిగాడు. హారో పాఠశాలలో ప్రవే శించిననాటికి జవహరు వయస్సు పదిహేనేళ్ళు నిండినవి.

మోతీలాలు దంపతులకు 'తమ ఏకైక పుత్రుని విదేశాలలో ఒంటరిగా విడుచుటకు' మనస్సులో ఎంతో బాధ కలిగింది. కానీ, తమ కుమారుడు గొప్పవాడు కావలయును కదా ! విద్యలేనిది గొప్పవాడు ఎట్లగును ? ఈ తలంపు రాగానే, వారు మనస్సు గట్టిపరచుకొన్నారు. తరువాత వారు జవహరుకు కావలసిన వసతు లన్నియు కల్పించి అచ్చటినుండి బయలుదేరారు. యూరప్ ఖండంలో గల ముఖ్యమగు దేశము లన్నీ తిలకించారు ; ఆనందంతో స్వదేశానికి తిరిగివచ్చారు.

ఆ కాలంలో మన భారతీయులు పాశ్చాత్య దేశాలకు వెళ్ళినవారిని ముట్టడం కూడ మహాపాపమని అనుకొనేవారు. అట్టివారి యింటిలో గ్రుక్కెడు నీరుకూడా త్రాగే వారు కాదు. కులంనుండి వెలివేశేవారు. శుభకార్యాలలో తోడ్పడేవారు కాదు; పైగా అవమానంతో తల దించుకొనేటట్లు సంచరించేవారు.

మోతీలాలుకు యీ తతంగమంతా తెలుసు. అయినా ఆయన వజ్రసంక ల్పుడు. 'మూఢనమ్మకాలు, మూఢ ఆచారాలు మధ్యన కల్పింపబడ్డాయి. వీటిని పూసం

వృద్ధికానీయరాదు. నాశనం చేయాలి. ఇందుకు మనం స్థిరసంకల్పంతో పట్టుదలతో నిల్వాలి' అని నిశ్చయించుకొన్నాడు. కావుననే ఆతడు సకుటుంబముతో యూరప్ ఖండమంతా తిరిగి రాగలిగాడు. ఆయన తత్త్వం, ఆయనకు గల సంపద గమనించిన వారగుటచే - బంధువులు గాని, మిత్రులు గాని ఆయన నేమీ అనలేకపోయారు. పైగా ఎంతో శ్లాఘించి, తోకజాడించారు వారంతా.

## జవహర్ కళాశాల జీవితము

"హారో" పాఠశాలలో మన జవహరు ఫ్రెంచ్, లాటిన్ భాషలుకూడ చక్కగా అభ్యసించాడు. ఆర్థిక, రాజకీయ సమస్యలకు సంబంధించిన గ్రంథా లనేకం చదివాడు. అందువల్ల మన జవహరు మంచి లోకజ్ఞానం కలిగి ఆంగ్లేయ బాలురకంటె యెంతో మెరుగుగా ఉండేవాడు.

"హారో" పాఠశాలలో మన జవహరు చదువుకొనుచున్న ఆ రోజులలో ఇంగ్లాండులో పార్లమెంటు ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికలలో లిబరల్ పార్టీ విజయం పొంది పాలనసాగిస్తూఉంది. ఒకనాడు పాఠశాలలో ఉపాధ్యాయుడు విద్యార్థులను చూచి, 'నేడు మనదేశంలో క్రొత్తగా ఏర్పడిన మంత్రివర్గ సభ్యులు ఎవరు? వారి పేర్లను వరుసగా చెప్పుడు' అని ప్రశ్నించెను. ఆ ప్రశ్న విని తెల్ల విద్యార్థులంతా తెల్లమొగాలు వేశారు. అసలే వారు తెల్లవారు. ఈ ప్రశ్నతో మరింత తెల్లబోయారన్నమాట! ఒక్క ఆంగ్ల విద్యార్థియైనా లేచి, మంత్రివర్గం పేర్లు చెప్పలేకపోయాడు.

అప్పుడు మన జవహరు లేచి, బ్రిటనులో క్రొత్తగా ఏర్పడిన మంత్రివర్గ సభ్యుల పేర్లుమాత్రమే గాక, వారు పాలించు వివిధ శాఖల పేర్లుకూడా, తడుముకొనకుండా వివరించి చెప్పాడట! అది విని ఆంగ్ల విద్యార్థులంతా మన జవహరు తెలివితేటలకు ఆశ్చర్యపడ్డారు. రాజకీయ విషయములందు మన జవహరుకు గల శ్రద్ధాసక్తులకు ఆనందించి యెంతో మెచ్చుకొని, ఆతనితో చాల ఆనందంగా కాలం గడిపేవారు.



## స్వచ్ఛంద సేవకుడుగా జవహరు

హారో పాఠశాలలో చేరిన మొదటిరోజులలో జవహరు ప్రతిభ ఎవరికీ అర్థంకాలేదు. అమాయకుడుగానే ఉండేవాడు. స్నేహితులతోకూడ ఎక్కువగా తిరిగేవాడు కాడు. కానీ, ఆటపాటల్లోమాత్రం పాల్గొనేవాడు. అప్పుడప్పుడు స్వచ్ఛందసేవక దళంలో చేరి పనిచేసేవాడు; ఆదొక విలాసం ఒక్కొక్కప్పుడు ఆ చుట్టుప్రక్కల గల రామణీయకతను దర్శించడానికి పర్వతారోహణము చేస్తూండేవాడు.

ఆటపాటలలో సైతం జవహరు మంచి చురుకుతనం, నేర్పు కలిగి-ఆంగ్ల విద్యార్థులను మించి - ఉండే

వాడు. పాఠశాల చదువు విషయముననే గాక, సాంఘిక-రాజకీయాది ఇతర విషయము లలో మన జవహరు తెల్లవారి పిల్లలకంటె చాల మెరుగుగా ఉండేవాడు. అందువలన ఉపాధ్యాయుల మెప్పు పొంది, తోడిబాలురకంటె ముందుగా పై తరగతులకు పంపబడే వాడు.

హారో పాఠశాలలో చదువు పూర్తిచేసినపిమ్మట జవహరు 'కేంబ్రిడ్జి ట్రినిటీ కళాశాల'లో చేరాడు. అందాతడు భూగర్భ శాస్త్రము, రసాయన శాస్త్రము, వృక్ష శాస్త్రము నేర్చుకొనసాగాడు. వానిద్వారా జవహరు విశేష శాస్త్రజ్ఞానమున్ను, ప్రపం చానుభవమున్ను సంపాదించగలిగినాడు. సెలవురోజులలో వృధాగా కాలము వెళ్ళ బుచ్చక యూరప్ ఖండమున గల ముఖ్యస్థలాలకు పోయి, అచ్చటి వింతలు విశేషా లను తెలిసికొని వచ్చేవాడు. విమానయానము మున్నగు ఆధునిక విషయా లన్న మన జవహరు చెవి కోసికొనేవాడు.

ఒకసారి జర్మనీకి ముఖ్యపట్టణమైన బెర్లిన్‌నగరంలో ఒకవిశేషం జరిగింది. 'కౌంట్ జప్లిన్' అను జర్మనీదేశస్థుడు మొట్టమొదటిసారిగా విమానయాత్ర జరుపుటయే ఆ విశేషం. ఆ వేడుక చూచుటకు అప్పటి జర్మనీ చక్రవర్తి యగు 'కైజర్' కూడ హాజరయాడు. విదేశదేశాలనుండి అనేకమంది శాస్త్రజ్ఞులు, విజ్ఞాన వేత్తలు అరుదెం చారు. మన జవహరుకూడ ఆ వింతను తిలకించడానికి బెర్లిన్ పట్టణానికి పోయాడు. ఆ యుత్సవాలను కండ్లార తిలకించి, ఆనందించి తిరిగివచ్చాడు. ఈ విధంగా జవహర్ ఎక్కడైనా, ఏదైనా విశేషం జరిగింది అంటే, అక్కడకు వెళ్లి చూచి వచ్చేవాడు.

## జవహర్ జలగండము

ఒకప్పు డొక మిత్రునితో జవహర్ నార్వేదేశం వెళ్లాడు. అచ్చట గల విశేషాలను చూచి సంతోషించెను. అక్కడ మన జవహరు నార్వే మిత్రునితో నడచి వచ్చెను. ఒకచోట గల జలప్రవాహాన్ని చూచాడు. మన జవహరుకు చిన్నప్పటినుండి ఈత యన్న ఎంతో ఇష్టము కదా! అందువల్ల ఆ జలప్రవాహంలో కొంతసేపు ఈది స్నానము చేదామని మిత్రునితో అన్నాడు మన జవహరు.



'నీఇష్టం! నేను చేయను; ఈ గట్టుపై ఉంటాను.' అని నార్వే మిత్రు డన్నాడు జవహరు వెంటనే ఆ ప్రవాహంలో దూకాడు. కానీ, మందలి నీరు మంచు నీరు. అందువలన, ఆ నీటి చల్లదనంతో జవహరు శరీరమంతా కొయ్యబారింది. ఈదుటకు శక్తిలేకపోయింది. తుదకు జవహరు అశక్తుడై ఆ ప్రవాహమున పడి

కొట్టుకుపోసాగినాడు. గట్టుపై నున్న నార్వేమిత్రుడా పరిస్థితిని గ్రహించాడు. వెంటనే ప్రవాహములో దుమికి కొట్టుకొని పోవుచున్న జవహరు కాలు పట్టుకొని ఎంతో కష్టము మీద ఒడ్డునకు తెచ్చి జవహరును ఆ గండంలో నుండి తప్పించినాడు.

ఆ మిత్రుడు చేసిన మేలును మన జవహరు తన జీవితకాల మంతయును మఱువలేదు. "ఆపదలో నున్న మిత్రునకు సహాయపడుట ;" "మిత్రుడు చేసిన మేలును మఱువకుండుట" అనునవి ఉత్తమపురుషుల లక్షణములు.

## జవహరుని భీరత్వం

లక్షలాది ప్రజలమధ్య, దేశదేశాల నాయకుల మధ్య, అనేకమంది శాస్త్ర వేత్తల మధ్య - నిర్భయంగా, అనర్గళంగా మహోపన్యాసా లిచ్చే మన జవహరు - ఆ నాడు - చదువుకొనే ఆ రోజులలో పదిమందిలో నిలబడి మాటాడ లేకపోయేవాడు. ఇది మనకు వింతగా తోచక మానదు. కానీ, ఆనాడు మాత్రం మాటాడ ధైర్యం చాలని భీరువు మన జవహరు. ఒక్కొక్కప్పుడు ఎంతో ఉత్సాహంతో మాటాడాలని లేచి నిలబడేవాడు. కానీ, భయంతో శరీరమంతా వణికిపోయేది. గుండె దడదడ లాడేది. గొంతు బొంగురుపోయేది. నోట మాట వచ్చేది కాదు. అందువలన మన జవహరు చదువుచున్న కళాశాలలో జరుపబడు "విద్యార్థుల చర్చ"లలో కూడ పాల్గొనేవాడు కాదు. ఆ చర్చలలో పాల్గొనని కారణముచే కళాశాలాధికారులు విధించే జరిమానాలు కూడ ఎన్నో కట్టాడట!

## జవహరు చెడుసహవాసము

'చెడుసహవాసదోషం ఎంతవానినైనా అష్టకష్టాలకు గురిచేస్తుంది.' కాబట్టి దానినుండి తొందరగా తప్పుకొన్నవాడే ధన్యజీవి. మన జవహరుకూడ కొన్ని దినాలు ఈ చెడు సహవాసదోషానికి గురయాడు. తండ్రి పంపించే ధనములో చాలవరకు తాను దుబారాగా ఖర్చుచేసేవాడు. ఎక్కడ ఏ వినోదం జరిగినా పదిమంది స్నేహితులతో వెళ్ళడం, రాజకుమారుడులా తిరగడం మొదట అలవాటయింది. రానురాను పేకాట వంటి జూదం ప్రారంభమయింది. ధనంతో ప్రారంభించిన ఆ జూదం - జవహరును ఎంతవరకు తెచ్చిందంటే - ఒక్కోరోజున చేతిలో ఒక పైసకూడ లేని పరిస్థితికి తెచ్చింది. తండ్రి యెంత డబ్బు పంపించినా చాలని స్థితికి వచ్చింది.



జవహరు కన్ను తెఱిచాడు. ఈ కష్టమునకు కారణం తన చెడుసహవాస ఫలితమని తెలిసికొన్నాడు. తన మేలు కోరి

తండ్రి వేలకు వేలు పంపిస్తూ ఉంటే, తా నిట్లు వృథాగా పాడుచేస్తూ అధోగతి పాలగుచున్నానే! అని ఎంతో పశ్చాతాపము చెందాడు. ఎప్పుడైతే ఈ మార్పు కలిగిందో, ఆనాటినుండీ తాను చెడు స్నేహితులను, చెడు సహవాసాలని పూర్తిగా వదులుకున్నాడు జవహరు.

జవహరుకు పత్రికా పఠనం లేని రోజు ఉండేదికాదు. ఆ పఠనం ఆతనికి మొదటినుండియు అలవాటే కదా! మన జవహరు దినపత్రిక ద్వారా భారతదేశ వార్తలు, ప్రపంచవార్తలు ఎప్పటి కప్పుడు తెలిసికొంటూ ఉండేవాడు. ఆ రోజులలో మన దేశమునందు దినదినాభివృద్ధి పొందుచున్న కాంగ్రెసు సంస్థను గూర్చియు, దాదాబాయి నౌరోజీ మున్నగు కాంగ్రెసు నాయకులు చేస్తున్న దేశసేవను గూర్చియు పత్రికలలో చదివి పొంగిపోయేవాడు. అక్కడి దినపత్రికలలో భారతదేశ వార్తలు వివరంగా ప్రకటించేవారు కారు. అయినా మన జవహరు భారతదేశం నుండి యింగ్లండు వచ్చే భారతీయ సోదరుల ద్వారా సర్వము తెలిసికొని ఆనందించేవాడు, "ఈ సమయంలో నేను కూడ అక్కడ ఉంటే ఎంత బాగుండేది" అని అప్పు డప్పు డనుకొనేవాడు,

ఈ విధంగా మూడు ఏండ్లు గడిచిపోయాయి. ట్రినిటీ కళాశాలలో, మన జవహరు ప్రథమ శ్రేణిలో ఎం. ఏ. (M. A.) పరీక్షలో విజయము పొందినాడు. ఈ సంగతి తండ్రి యగు మోతీలాల్ నెహ్రూకు అందింది; అతడు పరమానందం పొందాడు. అంతవరకు మోతీలాల్ నెహ్రూకు తన కొడుకు (I. C. S.) ఐ. సి. యస్.

ప్యాసై కలెక్టరు కావాలని ఉండేది. కానీ. కుమారుడు యం. ఏ. ప్యాసైనట్లు తెలియ జేస్తూ అదే ఉత్తరములో తన కోర్కెకూడ ఈవిధంగా తెలియజేశాడు.

తండ్రిగారి చరణ సన్నిధికి, కుమారుడు జవహర్ నమస్కారములతో వ్రాయునది :-

నేను క్షేమముగా ఉన్నాను. అక్కడి క్షేమములు, తఱచు తెలుపు చుండవలయును.

తరువాత, చెల్లెలు విజయలక్ష్మి ; చిట్టిచెల్లాయి కృష్ణ క్షేమములు తెలియజేయవలెను ; వారికి నా ముద్దులు అందజేయవలెను. అమ్మకు నా వందనములు తెల్పి, నా చదువు విషయమున ఆలోచించి, ఆశీస్సులు పంపమని చెప్పండి !

I. C. S. చదివి, నేను కలెక్టరుగా రావాలని, మీ కోరిక. సత్యమే. కానీ, నా దొక మనవి. I.C.S. చదివి నేను చేసేది ఏమిటి? ఎవరినైతే మనదేశం నుండి తరిమివేయాలని తహతహపడుతూ ఉన్నామో, అట్టివారివద్దనే ఉద్యోగం చేయాలి కదా ! నా మనస్సునకు ఇది అంగీకారముగా లేదు. నేను ఆంగ్ల ప్రభుత్వమువారి అదుపు ఆజ్ఞలలో మెలగాలనియే మీకు ఉంటే, మీకోసం కలెక్టరు నవుతాను. కాదేని మీవలె న్యాయవాదిగా (బారిష్టరుగా) భారతదేశములో నిలుస్తాను. మీ ఆశీస్సులు అందుకొనుటకై సిద్ధముగా నున్నాను. వందనములు.

తమ

జవహర్.

మోతీలాలు ఆ ఉత్తరము చూచుకొని పొంగిపోయాడు. తన కొడుకు కలెక్టరు అయి ఇంగ్లీవారి చెప్పుచేతలలో ఉండుట చాల నీచంగా కనిపించింది ఆ తండ్రికి. భార్యతోకూడా ఆలోచించాడు మోతీలాలు. కొడుకు కోరిన కోర్కెకు వారు ఆనందంతో ఒప్పుకొన్నారు. తమ సమ్మతిని కొడుకుకు అందజేసినారు.



మన జవహరు తండ్రి పంపించిన వార్తతో బ్రహ్మానందం పొందాడు. రెండు సంవత్సరాల పాటు లండనులో న్యాయ శాస్త్రము చదివి బారిష్టరు పట్టముపొందాడు.

## బారిష్టరు జవహర్‌లాల్ నెహ్రూ

అది 1912వ సంవత్సరము. అప్పుడు మోతీలాల్ నెహ్రూ కుటుంబముతో కాశ్మీర దేశమందున్న 'ముస్సోరీ' కొండలపై బస చేసి ఉన్నాడు. బారిష్టరు పట్టము పొందిన తమ సుపుత్రుడు 'జవహరు ఇంటికి వస్తున్నాడు' అను వార్త విన్నారు నెహ్రూ దంపతులు. పరమానందభరితులైనారు. సుమారు ఎనిమిదేండ్ల కాలము తమను ఎడబాసి విదే

శాలలో నున్న కుమారుడు ఉన్నతవిద్యలో జయముపొంది తిరిగి వస్తున్నాడంటే, తలి దండ్రులకు కలిగే ఆనందం ఎవరు వర్ణింపగలరు ?

వెంటనే మోతీలాలు నెహ్రూ, కుమారుని స్వాగతానికై తగిన ఏర్పాట్లు చేయించినాడు. గృహమంతా అంకరింపబడి కలకలలాడుతూ ఉంది. బంధు మిత్రు లందరకు ఆహ్వానాలు పంపబడినాయి. బారిష్టరుగా యింటికి వస్తున్న అన్నగారిని చూచి ఆనందించుటకై కళ్లు పెద్దవి చేసుకొని వీధివైపే చూస్తున్నది అతని పెద్ద చెల్లెలు విజయలక్ష్మి.

చిన్న చెల్లెలు కృష్ణకు అదేదో పండుగదినంలా ఉంది. తనకు జ్ఞానం వచ్చిన తరువాత ఇదే మొదటిసారి అన్నను చూడడం ; 'అన్న ఎలా ఉంటాడు ? దొరలాగా ఇంటికి వస్తాడా ? గుఱ్ఱం ఎక్కి (తండ్రి గుఱ్ఱం ఎక్కి ఇంటికిరావడం అనేకసార్లు చూచింది కృష్ణ) వస్తాడా ? కారుమీద వస్తాడా ?' ఇటువంటి ఆలోచనలతో ఆ చిట్టి చెల్లాయి అన్న రాకకై ఎదురుచూస్తూ, మధ్య మధ్య అక్కను అడుగుతూ ఉంది ఏడీ ! భాయి ; ఇంకను రాడేమి ?' అని.

మఱికొంతసేపటికి వీధివాకిట గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినిపించింది. అందరూ సంతోషంతో ఒక్కసారిగా లేచారు; ఎదురుగా వెళ్ళారు. జవహరు సుందర విగ్రహం వారికి నయనానందకరంగా గోచరించింది. జవహరు గుఱ్ఱం దిగి తల్లిదండ్రు లకు నమస్కరించాడు. బంధుమిత్రులకు వినయంతో వందనాలు సమర్పించాడు. పెద్ద చెల్లెలు విజయలక్ష్మి చిట్టి బుగ్గలు నిమురుతూ కుశల ప్రశ్న గావించాడు. 'అబ్బో ;

చిట్టి చెల్లాయి పెద్దదయిందే!' అని అమాంతంగా పైకి ఎత్తి ముద్దుపెట్టుకొని క్రిందికి దించాడు. జవహరు రాకతో ఆ గృహమంతా బ్రహ్మానందంలో మునిగిపోయింది. చక్కని విందుతో ఆ రోజంతా ఒక్క క్షణంలా గడిచిపోయింది.

## న్యాయవాదిగా జవహర్

జవహరు కొన్ని రోజులు తల్లిదండ్రులతో "ముస్సోరీ" కొండలపై హాయిగా కాలం గడిపాడు. తరువాత వారందరూ అలహాబాదుకు చేరుకొన్నారు. తండ్రి ప్రోత్సాహముతో జవహరు హైకోర్టులో న్యాయవాదిగా పని ప్రారంభించాడు.



"అఖిలభారత జాతీయ కాంగ్రెస్సు" మహాసభలు 1912-వ సంవత్సరములో "బంకీపూర్"లో జరిగాయి. అప్పటికి కాంగ్రెస్సు స్థాపింపబడి 22 ఏండ్లు అయినది. ప్రతి సంవత్సరము మహాసభలు జరుగుచుండేవి. ఆ సభలు తిలకించవలెనని జవహరుకు చాల కాలంనుండి కోరిక ఉంది. అందుచేత జవహరు బంకీపూరు బయలుదేరి వెళ్లాడు. అచ్చట మహాసభలో జరిగిన చర్చలను, అందు పాల్గొన్న అనేక మంది నాయకులను కండ్లార చూచి తృప్తిచెందాడు. ముఖ్యంగా ఆ మహాసభలో పాల్గొని మాటాడిన గోపాలకృష్ణగోఖలే యొక్క మేధాశక్తికి, వాకచక్యమునకు, ఆ ఉపన్యాస ధోరణికి ఎంతో ముగ్ధుడైపోయాడు.

ఆ దినాలలో "అఖిలభారత జాతీయ కాంగ్రెస్సు" సంస్థ సూట్లు, బూట్లు వేసుకొనే దొరలతోను, ఇంగ్లీషు బాగుగా వచ్చిన ప్రముఖ భారతీయులతోను నడుపబడుతూ ఉండేది. స్థానిక సంస్థలు మున్నగు వాటిలో కొన్ని సౌకర్యములు పొందుటకు సభలు జరిపి, తీర్మానములు చేయుటద్వారా కొందరు నాయకులు కృషి చేయుచుండెడివారు. కానీ "ఇంగ్లీషువారిని మన దేశంనుండి వెళ్లగొట్టి స్వాతంత్ర్యం పొందాలను కోరిక" ఎవరికీ ఉండేది కాదు. అందుకు కావలసిన కార్యక్రమం ఏది కూడ కాంగ్రెస్సు నిర్ణయించేది కాదు. ఇట్టి పరిస్థితిలో నున్న కాంగ్రెసుసంస్థ జవహరువంటి ఉత్సాహవంతు లగు యువకులను ఆకర్షించేది కాదు.

అయినప్పటికీ, ఎక్కడ కాంగ్రెసు మహాసభ జరుగు చున్నను జవహరు అక్కడ ప్రత్యక్షం అయేవాడు. ఇటు న్యాయవాద వృత్తిలో తండ్రికి కుడి భుజముగా ఉండేవాడు. కేసులలో చక్కగా వాదించి జయంమీద జయం పొందు తూనే ఉండేవాడు. ఈవిధంగా మన జవహరు కొద్దికాలంలోనే 'ప్రతిభావంతుడయిన న్యాయ వాది' అని పేరు సంపాదించు కొన్నాడు. ఇట్టి సుపుత్రునిగన్న మోతీలాల్ దంపతులు మహా అదృష్టవంతు లని" అంతా చెప్పుకొనేవారు. మోతీలాల్ నెహ్రూ లోలోపల ఎంతో మురిసిపోయేవాడు.



ఇటువంటి సన్నివేశాలను తిలకించియే కాబోలు!

"పుత్రోత్సాహము తండ్రికి। పుత్రుడు జన్మించినపుడె పుట్టదు; జను లా!
పుత్రుని కనుగొని పొగడగ। పుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ!"

అని వ్రాయకలిగినారు సుకవీశ్వరులు.

## న్యాయవాది - న్యాయ పరిశీలన

న్యాయవాదిగా ఖ్యాతిగాంచిన జవహరుకు క్రమంగా ఆవృత్తిపై శ్రద్ధ తగ్గిపోయింది. న్యాయవాది యైన మన జవహరు న్యాయపరిశీలన ప్రారంభించాడు. "ఏమి టీవృత్తి? ఒక్కొక్క తరుణంలో న్యాయంకంటె అన్యాయానికే ఎక్కువ స్థానం లభిస్తూ ఉంది. "మేము పట్టిన కేసులు గెలుపొందాలి" అను తాపత్రయంతో తాము అబద్ధమాడడం. సాక్షులచే కల్ల సాక్ష్యాలు ఇప్పించడం జరుగుతూ ఉంటాయి, అందులోను ఎంతో నేర్పుచూపిస్తూ ఉండాలి. అంటే: తమ సాక్ష్యులచే అబద్ధము చెప్పించినా వినువారికి నిజంవలె కనిపించాలి. "ఇది సత్యం." అని న్యాయవాది వాదించాలి. నిజం మంటగలసిపోవాలి. అసత్యం జయించాలి. ఈ వాదన సల్పి అసత్యానికి జయం చేకూర్చు వారంతా న్యాయవాదులు! అహా! ఇది ఎంత బూటకమైన వృత్తి! ఛీ! ఛీ! నేతిబీరకాయలో నెయ్యి ఎంత ఉందో, న్యాయవాద వృత్తిలో న్యాయం అంత ఉంది." అను విమర్శలో పడి, జవహరు న్యాయవాద వృత్తి అన్న ఏవగించుకొనేవాడు.

ఒకనాడొక మిత్రునితో సల్లాపాలు చేస్తుండగా, ఆ మిత్రుడు జవహరును చూచి 'ఏమి భాయీ! ఎట్లాఉంది నీ న్యాయవాదవృత్తి? నాల్గురాళ్ళు దొరుకుతున్నాయా? లేక మావలెనే ఉన్నావా? (అతడుకూడా న్యాయవాదియే). మావలె నీవెందుకుందువులే! సీమకేగివచ్చిన బారిష్టరువాయె' అని చనువుకొద్దీ అడిగాడు. జవహరు ఆ మిత్రుని మనస్సు గ్రహించాడు. చక్కని గుణపాఠం నేర్పేడు నవ్వుతూనే.

"చూడు భాయీ! న్యాయవాదిగా ఎవరు మంచి పేరు సంపాదించినా నాకు సంతోషమే. కానీ, ఆ బిరుదుకు ఇప్పుడు అన్యాయం జరుగుతూ ఉంది. డ్రామా రిహార్సిల్సు జరిపినట్టు న్యాయవాదులు ఒక రిహార్సిల్సు పెట్టి సాక్ష్యులను అసత్యవాదులను చేస్తున్నారు. అందువలన న్యాయస్థానమున జరుగుచున్నదేమిటి? అన్యాయానికి జయంకల్గుతూ ఉంది. కల్ల విజం అవుతూ ఉంది; నిజం కల్లగా మారిపోతూ ఉంది. దోషి నిర్దోషిగా, నిర్దోషి దోషిగా అగుచున్నాడు. కొన్ని సమయాలలో పరమపవిత్రమైన న్యాయస్థానమే అపవిత్రమై భరింపరానిదిగా మారిపోతూఉంది. ఇక సంపాదనకా? పైరీతి మసలే న్యాయవాదానికి రెట్టింపు ఫీజు! లభిస్తుంది" అని నీతిపాఠాంగా-తనలో ఉన్న న్యాయవాద వృత్తిపై గల కసి నంతా వెళ్ళగ్రక్కేడు మన జవహరు.

పాపం! ఆ మిత్రుడు మరి నోరెత్తకుండా, ఆ సంభాషణ అంతటితో నిలిపి వేశాడట!

## జవహరుని వేట - వేట ఫలితం

ఈ విధంగా జవహరుకు న్యాయవాద వృత్తిపై విసుగు జనించిన పిమ్మట- "ఇకముందు ఏమి చేయడమా?" అని గాఢంగా ఆలోచించ సాగాడు. మార్గం గోచరించలేదు. మనస్సులో అశాంతి ప్రబలిపోయింది. ఈ అశాంతి వేటవలననైనా కొంత తగ్గునేమో! అని తలంచి ఒకనాడు వేటకు బయలుదేరాడు తుపాకి ధరించి.

జవహరుకు చిన్న చిన్న జంతువులను వేటాడడం ఎప్పుడూ ఇష్టం కాదు. 'చంపితే క్రూర మృగాలను చంపాలి. అదే ధీర లక్షణం' అని ఏనాడో ఆయన మేనమామ చెప్పాడు. ఆదేమాట జవహరులో గూడు కట్టుకుపోయింది.

ఆ రోజు మాత్రం జవహరుకు ఎంత ప్రయత్నించినా పెద్ద జంతువులు ఏవీ కనిపించలేదు. వట్టిచేతులతో తిరిగి వెళ్ళిపోతే ఎంత అవమానం; అంతకుముందెప్పుడూ ఇలా జరిగి ఉండలేదే! ఒకనాడతడు సునాయాసంగా ఒక ఎలుగు బంటిని చంపాడు. మరోనాడు చిరుత పులిని పడగొట్టాడు. కానీ ఈనాడు ఏమీ కనిపించడం లేదే! జవహరు పట్టుదల కలవాడు కదా! నిరుత్సాహ పడలేదు. దూరంలో ఏదో పరుగెత్తుచున్న సవ్వడి వినవచ్చింది. "ఢాం" అని తుపాకిని పేల్చాడు. అది ఒక



జింకకు తగిలింది. మన జవహరు దాని దగ్గరకు పరుగెత్తాడు. జింక గిల గిల కొట్టుకుంటూ జవహరు పాదాలముందరనే ప్రాణాలు విడిచింది. ఆ దృశ్యం జవహరు మ అవలేక పోయాడు.

జవహరుకు దానిబాధ మానలేని మచ్చగా నిలిచి పోయింది. 'అది తనకు చేసిన అపకారం ఏమిటి? వృధాగా దాని జీవితం ఎందుకు తీయవలసివచ్చింది? తనకు ఎటువంటి అపకారంకూడ చేయక, హాయిగా, గంతులువేస్తూ, తన దారిని తాను పోవు చున్న - ఆ నోరులేని జంతువును - నిష్కారణంగా చంపి, పాపము కట్టుకొన్నానే!' అని కుమిలిపోయాడు జవహరు. అది గిలగిల కొట్టుకుంటూ ప్రాణాలు విడిచిన రెండు నిమిషాల్లోను, రెండు కళ్ళనుండి రెండు దోసిళ్ళ నీరును విడిచాడు. వేటాడిన ఆనందం ఈవిధంగా తీరింది జవహరుకు.

వేటాడి కష్టనష్టములు పొందిన పూర్వరాజులు అందరూ జవహరు స్మృతి పథాల్లో గోచరించి మాయమైనారు. 'వేటవల్ల యీ పరితాప ముందని తెలిసికూడ ఈ క్రూరకార్యానికి పూనుకొన్నాను. ఛీ! ఎంతటి అవివేకము. ఇకముందు ఎన్నడు నిట్టి అమానుషకృత్యాలకు దిగను' అని తనలో తానే అనుకొన్నాడు.

ఆనాటినుండి జవహరు తిరిగి వేటకు పోలేదు; నోరులేని జంతువులను హింసించనూలేదు. అంతేగాక, చేతులారా పెంచి, పెద్దచేసిన కోళ్లను, మేకలను చంపి తినే ప్రజలను తలంచుకొని ఎంతో మధనపడేవాడు. చేతనైనంతవరకు 'జీవహింస పనికిరాని'దని ప్రచారము చేశాడు; చేయించినాడుకూడ.

## 1914, మొదటి ప్రపంచయుద్ధం - హోంరూలు ఉద్యమం

1914వ సంవత్సరంలో యూరఫ్ఖండములో యుద్ధం బయలుదేరినది. దీనినే 'మొదటి ప్రపంచ యుద్ధం' అని మన పెద్దలు వక్కాణించారు. ఈ యుద్ధం జర్మనీ–బ్రిటనుల మధ్య ప్రారంభమై 'చిలికి చిలికి గాలివాన'గా మారినట్లు ఈ యుద్ధము యూరఫ్ఖండ మంతటా వ్యాపించిపోయింది. క్రమంగా దాని గాలి ఆసియాఖండానికి సోకి, ఇండియా సరిహద్దులలోనికి వచ్చింది. అప్పుడు బ్రిటిషువారు మన భారతీయులకు పెద్ద ఆశ చూపించి నమ్మించారు. మన భారతీయ నాయకులు నమ్మారు. బ్రిటిషువారు మనకు చూపిన ఆశ ఏమిటో విన్నారా? అది ఇది:

'ఈ యుద్ధానంతరము భారతీయులకు స్వపరిపాలన ఇస్తాము. కావున భారతీయు లందరూ నడుం బిగించి ఈ యుద్ధానికి సహాయంచేయండి.'

బ్రిటిషు పెద్దమనుష్యులు చేసిన వాగ్దానాలు నమ్మి, లక్షలాది భారతీయులు సైన్యంలో చేరారు; కుబేరులను మించిన ధనవంతులు ఎందరో ధనరూపమున సహాయ పడ్డారు. ఆ యుద్ధంలో ఆంగ్లేయులు జయం పొందుటకు మనవారు చేసిప త్యాగమంతా 'బూడిదపోసిన పన్నీరు' అయినది.

ఆ యుద్ధం ముగిసిన తరువాత మనకు స్వపరిపాలన ప్రసాదిస్తామన్న ఆంగ్లప్రభువులు యెదురుతిరిగారు; మనకు 'రౌలట్ శాసనము'ను ప్రసాదించారు. ఈ శాసనాన్ని మన భారతీయుల చిరకాలవాంఛపై గొడ్డలిపెట్టువలె వచ్చిపడింది. ఈ అన్యాయాన్ని సహించలేకపోయారు మన నాయకులంతా.

అప్పుడే మనదేశంలో హోంరూలు (స్వపరిపాలన) బయలుదేరింది. ఈ ఉద్యమానికి అనిబిసెంటు, లోకమాన్య బాలగంగాధర తిలక్ యాజమాన్యం వహించారు. ఆ సందర్భంలో అనిబిసెంటు సతి యిచ్చిన ఉపన్యాసాలు మన భారతీయులలో ఎంతో చైతన్యాన్ని కలిగించాయి. మనవారి తీవ్ర చలనానికి బ్రిటిషు ప్రభుత్వ మెంతో బెదరిపోయింది కూడ. అనిబిసెంటు సతి గావించిన మహోపన్యాసములు, చూపివ త్యాగము, భారతీయులలోని దేశభక్తిని రేకెత్తించినాయి. ముస్లిములుకూడ 'హోంరూలు'

ఉద్యమంలో చేరారు. ఉద్రేకపూరితులయిన యువకులు ఎందరో సభ్యులుగా చేరారు. ఆవిధంగా సభ్యులైన యువకులలో మన జవహరుకూడ ఒకడు.

చిరకాలంనుండి దేశసేవ చేయుటకు కుతూహలపడుచున్న మన జవహరుకు తగిన సమయమూ, సమర్థులైన నాయకులూ లభించారు. అందువలన మన జవహరు ఆ ఉద్యమంలో బిసెంటు సతికి అనుచరుడై తీవ్రమైన ప్రచారము చేసినాడు.

బిసెంటు సతి నాయకత్వమున. దినదినాభివృద్ధి పొందుతున్న ఉద్యమాన్ని చూచి బ్రిటిషుప్రభుత్వం ఓర్వలేకపోయింది. 'ఇప్పటికే ఈ ఉద్యమం దేశం నలు మూలలా వ్యాపించిపోయింది. మనము నిర్లక్ష్యంచేసిన ఇది స్థిరపడిపోవును' అను భయముతో తెల్లవారు బిసెంటు సతిని అరెస్టుచేశారు. ఆమెను నిర్బంధించుట మిత వాదులకుకూడ చాల కష్టమనిపించింది కాబట్టి అంతవరకు మితవాదులుగా ఉంటున్న మోతీలాలు నెహ్రూవంటి ప్రముఖ నాయకులు అనేకమంది కాంగ్రెసులో చేరి. దేశ మంతటా హోంరూలు ఉద్యమాన్ని జయప్రదంగా కొనసాగించడానికి పూనుకొన్నారు.

క్రమక్రమంగా మన జవహరు, మిత్రుల ప్రోత్సాహంతో సభలలో గద్దెక్కి ఉపన్యాసా లివ్వడం ప్రారంభించినాడు. ఆయన మొట్టమొదటిసారిగా 1915 వ సం॥లో ఉపన్యసించాడు ఆ ఉపన్యాసమును విన్న తేజబహదూర్ సప్రూవంటి అగ్రనాయకులు బహిరంగంగా జవహరును ఎంతో మెచ్చుకొని శ్లాఘించారు.

# 1915 - భారతదేశానికి మహాత్ముని రాక

1915వ సంవత్సరం నాటికి దక్షిణాఫ్రికా నుండి గాంధీజీ భారతదేశానికి వచ్చి స్థిరపడ్డాడు. అప్పటికిగాని ఆయన దక్షిణాఫ్రికా దిగ్విజయంకాలేదు. అక్కడి భారతీయులకు దాస్యము తప్పించిన మహా త్యాగి గాంధీ. గాంధీజీ రాకతో కాంగ్రెసు సంస్థ కలకల లాడింది.

గాంధీజీ దక్షిణాఫ్రికా భారతీయులకు చేసిన మేలును ఆలకించి మహాకవి రవీంద్రుడు గాంధీజీకి "మహాత్ముడు" అను బిరుదును ప్రసాదించాడు; భారతజాతీయ నాయకు డగు గోపాలకృష్ణగోఖలే మహాత్ముని కొనియాడుచు - గాంధీజీని శిష్యవాత్సల్యంతో దగ్గరకు తీసికొన్నాడు. కాంగ్రెసు సంస్థలో ప్రముఖపాత్రగా నిలబెట్టినాడుకూడ.



మహాత్ముని రాకకుముందు. కాంగ్రెసు సంస్థను అభివృద్ధికి తెచ్చిన నాయకులలో సర్ ఫిరోజ్‌షా మెహతా, బాలగంగాధర తిలక్, గోపాలకృష్ణగోఖలే, మొదలగువారు ముఖ్యులు. వారికి భారతీయులలో మంచి పలుకుబడి ఉండేది.



భారతదేశంలో గాంధీజీ కాలు మోపిన కొద్ది రోజులకే గురుతుల్యు డగు గోఖలే మరణించినాడు. గాంధీజీ ఎంతో దుఃఖించాడు. అదే సం॥ 1916లో గురువును మించిన శిష్యుడు ఆయనకు లభించాడు.



## జవహరు వివాహము

1916వ సంవత్సరములో జవహరునకు కమలతో వివాహము జరిగింది. అప్పటికి జవహరు వయస్సు 27 సం॥లు. కమల వయస్సు 17 సంవత్సరాలు. కమల ఢిల్లీ కాపురస్తుడు, భూస్వామియు అగు 'జవహర్ కౌల్' అనునతని పుత్రిక. చక్కనిచుక్క. సద్గుణ ఖని. భర్తకోరిక ప్రకారము జాతీయోద్యమములో చేరి, జీవితాంతం వరకు దేశసేవ చేసిన మహిళామణి కమలా నెహ్రూ.

జవహరు వివాహానికి మోతీలాలు నెహ్రూ బంధు మిత్రులతో, ప్రత్యేక రైలులో బయలుదేరి ఢిల్లీ చేరుకొన్నాడు. అచ్చట తగిన వసతి సౌకర్యాలు లేకపోవుటచే, అప్పటి

కప్పుడు ప్రత్యేక గుడారాలు వేయించి, తమ వెంట వచ్చిన బంధు మిత్రులకు సౌకర్యాలను కలిగించాడు మోతీలాల్ నెహ్రూ.

కమలా జవహరుల వివాహం ఢిల్లీ పట్టంలో మహావైభవంగా జరిగింది. విందులూ, వినోదాలు జయప్రదంగా కొనసాగాయి. వారంరోజులు ఢిల్లీ పట్టణంలో హాయిగా కాలం గడిచింది. తరువాత బంధు మిత్రులతో, క్రొత్త కోడలిని వెంటబెట్టుకొని అలహాబాదుకు తిరిగివచ్చారు పెండ్లిపెద్దలగు స్వరూపరాణీ, మోతీలాల్ నెహ్రూలు.

## నవదంపతుల కాశ్మీరు ప్రయాణం

వివాహమైన కొన్ని దినాలకు నవదంపతులు (కమలా జవహరులు) కాశ్మీరు సోయగాలను తిలకించుటకు బయలుదేరారు. కాశ్మీరుదేశం జవహరు దంపతులకు తాత-ముత్తాతల స్వస్థలం. అంతియే గాక, ప్రపంచ ప్రసిద్ధిగాంచిన సుందరప్రదేశం. అట్టి అందాలదేశం కాశ్మీరును చూచి, ఎంతో ఆనందించినారు మన జవహర్లాల్ దంపతులు.

జవహరుకు చిన్నప్పటినుంచీ హిమాలయ పర్వతాలను ఎక్కాలనీ ఆ ప్రాంతమున ఉన్న సృష్టివైచిత్ర్యాన్నీ, ఆ మంచుకొండలలో గల విశేషాలనీ కండ్లార చూచి, ఆనందించాలనీ ఎంతో కోరిక ఉండేది. ఆ ముచ్చటను ఇప్పుడు తీర్చుకోవాలని అనుకున్నాడు జవహరు. అందువల్ల జవహరు భార్యను బసలో విడిచి, ఒక మిత్రుని వెంటబెట్టుకొని, బయలుదేరినాడు. ఆ హిమాలయాలలో - పదునాలుగువేల అడుగులకు పైగా - ఎత్తున ఉన్న 'మానసరోవరం' - 'అమరనాథుని గుహ' మున్నగునవి చూచి రావలె నని జవహరుని సంకల్పం.

హిమాలయ పర్వతాలను ఆరోహించడం అంటే అంత తేలికయైన పని కాదు. ఆ పర్వతాలు ఎల్లప్పుడు మంచుతో నిండి ఉంటుంటాయి. అడుగు వేస్తే 'జఱ్ఱున' జారిపోతుంది. వాటిని ఎక్కుటకు మంచి అనుభవమూ, ధైర్యము ఉన్నవారే భయ పడుతూ ఉంటారు. అట్టి మహాపర్వతాలను ఎక్కుటకు నిశ్చయించుకున్నాడు మన జవహరులాల్.

జవహరులాలు సాహసంతో, మిత్రునితో కొంతదూరం ఆ మంచుకొండలపై ప్రయాణము సాగించాడు. తరువాత జవహరు ఆలోచించి, కూడా తెచ్చిన ఒక మోకు త్రాడుతో వారిద్దరూ నడుములకు కట్టుకొన్నారు. మంచుకొండలపై సంచరించే అలవాటు కొంత ఉంది జవహరు మిత్రునికి. అందువల్ల - ఆయన ముందు ; జవహరు వెనుకగా నెమ్మదిగా ఆ కొండలను ఎక్కడం ప్రారంభించారు.

## జవహర్‌లాలు - హిమాలయ ఆరోహణ

మంచుకొండలపై ప్రయాణముచేస్తున్న ఆ మిత్రు లిద్దరు మధ్య మధ్య కూర్చుంటూ, లేస్తూ ప్రయాణాన్ని సాగిస్తున్నారు. క్రమంగా జవహరుకు - అలవాటు లేని కారణం - కనుక శక్తి సన్నగిల్లడం ప్రారంభించింది. ఆయాసం అధికమయింది. అయినా అతడు తన ఉత్సాహాన్నిమాత్రం చంపుకోలేదు. కష్టపడి, ఆ కొండలపైకి ఎక్కుతూనే ఉన్నాడు. ఇట్లు శ్రమపడి, వారు ఎట్లాగైతేనేమి ! పదహారువేల అడుగుల వరకూ పైకి వెళ్లారు. ఇక పైకి వెళ్ళడమంటే, జవహరుకు కష్టంగా ఉంది. అడుగు

ముందుకు పడటంలేదు. అప్పటికి 'బదరీనాథుని గుహ' దగ్గరలోనే ఉందని మిత్రుడు చెప్పాడు. జవహరు లేని బలం తెచ్చుకొని, చలికి తట్టుకొంటూ ముందుకు బయలు దేరాడు; ఒక మంచుగడ్డపై కాలుపెట్టి పైకి ఎక్కబోతుండగా, ఆ గడ్డ విడిపోయింది. అందువల్ల జవహరు కాలుజారి క్రిందకు జారిపోసాగాడు. జవహరు పడిపోతున్న క్రిందిభాగము అగాధమైన లోయ. అది అచటికి పద్దెనిమిదివేల అడుగుల దూరమట;



జవహరు పరిస్థితి వెంటనే ముందున్న మిత్రుడు గమనించాడు. వారిద్దరు ఒకే త్రాడు నడుములకు బిగించుకొనిఉన్నారు కదా! అందు వల్ల అతడు కదలకుండ, స్థిరంగా కూర్చుండి, 'త్రాడు సహాయముతో చేదతో నూతిలోని నీళ్ళు తోడినట్లుగా' నెమ్మది నెమ్మదిగా త్రాడును లాగుతూ - జవహరును పైకి చేర్చగలిగాడు; ఆ మిత్రుడు. ఆహా! మిత్రవాత్సల్యము ఎంత గొప్పదో చూచితిరా!! దూరదృష్టితో నడుము లకు త్రాడు కట్టుకున్నారు గనుక, ప్రమాదం తప్పిపోయింది గాని, లేకపోతే ఆనాడు మన జవహరు ఏమైపోయేవాడో ఊహించనైనా ఊహించలేము కదా!

## జవహరు ఆశాభంగం - తిరిగివచ్చుట

ఈ ప్రమాదం సంభవించుటవల్ల జవహరు ఆశించినట్టుగా 'బదరీనాథుని గుహ' గాని, 'మానసరోవరం' గాని చూడలేకపోయాడు. జవహరు అంత ప్రమాదం సంభవించినా, భయపడక - మరల పైకి ఎక్కుటకు సిద్ధపడినాడు. కానీ, మిత్రుడు వద్దనీ, తానింక పైకి రాజాలననీ భీష్మించాడు. అందువల్ల జవహరు ఆశాభంగంతో తిరిగి బసకు చేరుకున్నాడు మిత్రునితో.

భగవదనుగ్రహంవల్ల తన భర్త బ్రతికి బయటపడినందుకు ఎంతో ఆనందించింది కమలానెహ్రూ. తన భర్తను కాపాడిన ఆ మిత్రుని దైవముగా భావించి పూజించినది. మరి కొన్నాళ్లు ఆ దంపతులు కాశ్మీరులో హాయిగా కాలంగడిపి, అలహాబాదుకు తిరిగివచ్చారు.

## గాంధీ - నెహ్రూలు

1916-వ సంవత్సరములో అఖిలభారత జాతీయ కాంగ్రెసు మహాసభ "లక్నో"లో జరిగినది. ఆ సభకు గాంధీగారు కూడ వచ్చారు. ఆ సమయంలో గాంధీజీ దక్షిణాఫ్రికాలో నివసిస్తూ ఉండేవారు. దక్షిణాఫ్రికాలో మన భారతీయులు పడుచున్న కష్టములను తొలగించుటకు ఆయన (గాంధీజీ) "సత్యాగ్రహము" అను ఒక క్రొత్త పద్ధతి ఉద్యమం ద్వారా చాల వఱకు విజయము పొందినారు. గాంధీజీ నాయకత్వంతో దక్షిణాఫ్రికాలో సాగుచున్న సత్యాగ్రహ వార్తలు మన జవహరు ఎప్పటి కప్పుడు చదివి ఆనందిస్తూ ఉండేవాడు,

దక్షిణాఫ్రికాలో నివసిస్తూ, అష్ట కష్టాలు పడుచున్న భారతీయులకు మన దేశీయుల సానుభూతి, సహకారములను సంపాదింప వలయు నని తలంచి గాంధీజీ లక్నో కాంగ్రెసు మహాసభకు విచ్చేసి నారు. ఆ సందర్భమున జవహరు మొదటి సారిగా గాంధీజీని దర్శించి తృప్తిజెందాడు. ఆయనతో మాటాడి, దక్షిణాఫ్రికా ఉద్యమా నికి సంబంధించిన అనేక విషయాలను కూడ తెలిసికొన్నాడు మన జవహరులాల్ నెహ్రూ.



## 1917 - ఇందిరాగాంధి జననం

'హనీమూన్' గడిపి వచ్చిన కొంత కాలానికి, అనగా వివాహమైనతరువాత 20 మాసాలకు మన జవహర్ దంపతులకు 1917వ సంవత్సరములో కుమార్తె కలిగినది.

ఆమె పేరు ఇందిర. ఈ ఇందిరయే నేడు 'కేంద్ర రేడియో, సమాచార శాఖా మంత్రిణిగా పనిచేయుచున్న శ్రీమతి ఇందిరాగాంధీ.

ఇందిరాగాంధి పుట్టుకతో తల్లి యగు కమలా నెహ్రూ పూర్తిగా ఆరోగ్యం కోల్పోయింది. క్రమముగా ఆ అనారోగ్యం 'క్షయ'లోనికి దించి వేసింది. పాపం! కమలానెహ్రూ ఆ క్షయవ్యాధితో బ్రతికినన్నాళ్ళూ బాధ పడింది.



## 1919 - పత్రికా నిర్వహణ

నెహ్రూజీ సదా ఉన్నతాదర్శాలు కలవాడు గదా! దేశ స్వాతంత్ర్యానికై అతడు అనేక ఆలోచనలు చేస్తూ ఉండేవాడు. 'తన ఆలోచనలను దేశ నాయకులు, ప్రజలు గుర్తించాలి. ఎట్లు?'-

అని దీర్ఘంగా ఆలోచించేవాడు. చివరకు తండ్రి ప్రోత్సాహంతో 1919 సంవత్సరములో 'ఇండిపెండెంటు' అను ఒక వార్తా పత్రికను స్థాపించాడు. ఇందులో తన అనుమానాలు, చేయదగిన విధానాలు - అన్నీ బాహాటంగా వెల్లడించేవాడు జవహర్‌జీ. ఈవిధంగా ఆ పత్రిక రెండు సంవత్సరాలు బాగా నడిచింది, తరువాత ఆయన తొలి సారిగా జైలుకు (1921లో) వెళ్ళిన కారణంవల్ల నిర్వహించు దక్షతలేక ఆగిపోయింది.

## 1920 - పంజాబు దురంతరాలు

భారతదేశ స్వాతంత్ర్యానికై జరిగిన యుద్ధంలో అనేకులు అనేక విధాలుగా తమ ప్రాణాలను బలియిచ్చారు. కొందరు మరీ దారుణంగా మరణించారు. అట్టివానిలో పంజాబు దురంతాలు మరువరాని భయంకర దృశ్యాలు.

గాంధీజీ సత్యాగ్రహ సమయంలో డాక్టర్ కిచ్లూ, డాక్టర్ సత్యపాల్ అను ఇద్దరు కాంగ్రెసువీరులు అమృత్‌సర్‌లో అరెస్టు అయిన కారణంగా ఈ పంజాబు దురంతాలు ప్రారంభమయాయి.

ఆ యిద్దరి దేశభక్తులను విడిచిపెట్టవలసిందిగా ప్రజలు గొప్ప ఊరేగింపు తీశారు. దానిపై పోలీసులు దారుణంగా తుపాకీగుండ్లను పేల్చి అనేకమందిని చంపారు. అందువల్ల ప్రజలు పెచ్చురేగారు; పోలీసులను ఎదుర్కొన్నారు.

పట్టణమంతా ఆవేశంతో నిండిపోయింది. ఇందుకు రైలుస్టేషను, రెండు బ్యాంకులు ఆహుతి అయాయి. అంతేకాక కొంతమంది పెద్ద ఉద్యోగాలలో ఉన్న ఐరోపియన్‌లు బలి అయారు

ప్రభుత్వ సేనానిగా ఉంటున్న 'డయ్యర్' ఐరోపియన్‌ల మరణంతో రాక్షసుడైపోయాడు. ఆనాడు 'జలియన్‌వాలాబాగ్' (ఇది ఒక తోట)లో కాంగ్రెసు సభ జరుగుతూ ఉంది. అది తెలిసికొన్నాడు డయ్యర్ సేనాని.

వెంటనే సైన్యంతో అక్కడకు పోయి, సైనికులకు తుపాకులను పేల్చమని ఆజ్ఞ యిచ్చినాడు డయ్యర్. వెంటనే వేలకొద్దీ గుండ్లు పేలాయి. ఆ తోటకు ఒకటే ద్వారం. వేలకొద్దీ ప్రేక్షకులు ఆ సభలో ఉన్నారు. పాపం! వారందరూ డయ్యర్ అమానుష కృత్యానికి బలిఅయిపోయారు. అంతటితో ఊరుకోక, డయ్యర్ ఎనిమిది దినాలు ఈ హత్యాకాండను నగరంలోకూడా జరిపించాడు.

ఈ అమానుష కృత్యాలు గాంధీజీ నెహ్రూజీ విని ఎంతగానో దుఃఖించారు. అప్పటికి పండిత మదనమోహన మాలవ్యా, మోతీలాల్‌నెహ్రూ, స్వామి శ్రద్ధానంద మొదలగు నాయకులు పంజాబు పర్యటనలోనే ఉండి దేశసేవ చేస్తూ ఉన్నారు. వారి ద్వారా గాంధీజీ పంజాబులో శాంతిని నెలకొల్పజేశాడు; తోడుగా జవహరును కూడా పంపించాడు. ఈ విషయంలో జవహరులాలు పడిన శ్రమ; చూపిన నేర్పు వర్ణనాతీతం.

## 1921 సహాయ నిరాకరణోద్యమం

గాంధీజీ 1921 సం॥ లో సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించాడు. కల్లు - సారాయి దుకాణముల ముందు పికెటింగు మొదలయింది. మద్యపానము, విదేశ వస్తు బహిష్కారణ, బిరుదుల విసర్జన జరిగింది. ఈ సందర్భములో న్యాయ వాదులు తమ వృత్తులను మానివేశారు. విద్యార్థులు బడులకు పోవుట మానివేశారు. ఈ నిరాకరణోద్యమంనాటికి ఇప్పుడు ప్రధానమంత్రిగా ఉంటున్న శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి చదువుకొంటూ ఉన్నారు. ఆయనకూడ చదువుకు స్వస్తివాచకం జెప్పి దేశ సేవలో నడుం బిగించారు. సరిగా ఇదే సమయానికి బ్రిటిషు యువరాజు 'ప్రిన్స్ ఆఫ్ వేల్సు' భారతదేశాన్ని సందర్శించడానికి వచ్చాడు. అప్పుడు జరిపిన హర్తాళ్ సందర్భంలో తొలిసారిగా జవహర్ అరెష్టు అయ్యాడు. ఆయనతోపాటు తండ్రియగు మోతీలాల్ నెహ్రూ, మరికొందరు నాయకులు కూడ అరెష్టు అయ్యారు.

## 1925 కమలానెహ్రూ అనారోగ్యం

1925-వ సంవత్సరంలో అకస్మాత్తుగా కమలానెహ్రూకు పాతవ్యాధి చెలరేగి విషమించింది. డాక్టర్లు అనేక విధాలుగా ప్రయత్నించి విఫలులైనారు, అందువల్ల ఆమెను అలహాబాదునుంచి లక్నో ఆసుపత్రికి మార్చడం జరిగింది.

ఈ సంగతి అప్పటికి జయిల్లో ఉన్న జవహర్‌లాల్‌కు తెలియజేయబడింది. ఆ వార్త విని, జవహర్ ఎంతగానో కుమిలిపోయాడు. నాయకులు, ప్రజలు చేసిన

ఒత్తిడివల్ల ప్రభుత్వం జవహరును విడుదల చేసింది. వెంటనే జవహరు లక్నో ఆసుపత్రికి వెళ్ళాడు. స్వయంగా కొన్ని నెలలు ఆమెకు శుశ్రూష చేశాడు; ఎన్నో రాత్రులు ఆసుపత్రిలోనే గడిపాడు కూడ. కానీ భార్య ఆరోగ్యం మాత్రం కుదుట పడలేదు. అందువలన ఆమెను - మిత్రుడైన డాక్టర్ యం. ఏ. అన్సారీ సలహాపై - స్విట్జర్లాండుకు తీసికొనిపోవుటకు నిశ్చయించుకొన్నాడు.

## జవహరు కుటుంబసమేతముగా యూరఫ్ యాత్ర

జవహరులాలు, భార్య ఆరోగ్యం నిమిత్తమై 1926వ సం॥ మార్చి నెల మధ్యభాగములో యూరప్పు ఖండమున గల స్విట్జర్లాండుకు బయలుదేరినాడు. ఆయన వెంట - అప్పటికి ఎనిమిదేండ్ల వయస్సు గల కూతురు ఇందిరాగాంధియు, భార్యయగు కమలా నెహ్రూయు కాక - పెద్ద సోదరియగు విజయలక్ష్మి పండిట్, ఆమె భర్తయగు రంజిత్ పండిట్ కూడా బయలుదేరినారు.

1926 మార్చిలో వెళ్ళిన జవహరు కుటుంబము 1927 డిశంబరువరకు యూరప్పులోనే ఉండవలసివచ్చినది. కమలా నెహ్రూకు అప్పటికి కొంచెము గుణము కనిపించినది. ఆ సందర్భంలో మన జవహరు ఎక్కువకాలం భార్య ఆరోగ్యం నిమిత్తమై అక్కడ గడిపినా, మధ్యమధ్య ఫ్రాన్సు, బెల్జియం, హాలెండు, ఇంగ్లండు, జర్మనీ, సోవియట్ మొదలగు దేశాలు దర్శించి వచ్చేవాడు.

అక్కడ (ఆయా దేశాలలో) భారతీయులయొక్క ఉన్నతినిగూర్చి, వారల సత్యశీలమునుగూర్చి పెక్కు ఉపన్యాసాలు ఇచ్చాడు; పత్రికాముఖమున విదేశీయుల దృష్టికి భారతీయు లన్నచో గౌరవము కలిగేటట్లు చేశాడు. అప్పటినుండియే యూరప్పు దేశాలలో మన భారతీయులకు - చదువుకొనుటకు గాని, వ్యాపారములు సాగించుటకు గాని చక్కని అవకాశాలు లభించాయి.

జవహరులాలు నెహ్రూ ఈ విధముగా భార్య ఆరోగ్యం నిమిత్తమై యూరప్పుదేశ మేగినా, భారతీయులను, భారతదేశాన్ని విస్మరించలేదు. పైగా వారికి అక్కడ గౌరవస్థానం సంపాదించినాడు తరువాత 1927వ సం॥ డిశంబరు నెలలో అక్కడనుండి బయలుదేరి, కుటుంబ సమేతముగా మద్రాసుకు చేరుకొన్నాడు.

## 42వ కాంగ్రెసు మహాసభ (మద్రాసు 1927)

1927వ సంవత్సరములో 'కాంగ్రెసు మహాసభ' మదరాసులో మహావైభవంగా జరిగింది. జవహరులాలు నెహ్రూ - తన కుటుంబముతో యూరప్పుఖండము నుండి వస్తూ, మద్రాసు కాంగ్రెసు మహాసభకు విచ్చేసినాడు.

అప్పటికి కాంగ్రెసులో చాల అవకతవకలు బయలుదేరాయి. గాంధీజీకూడ రాజకీయాలతో చాలవరకు సంబంధాలు తెంచుకొన్నాడు. కాంగ్రెసు సంస్థకు తగిన నాయకుడు లేక, ఉన్నవారిలో ఒకరిమాట లింకొకరికి సరిపడక - నామమాత్రంగాఉంది. అది గమనించాడు మన జవహరులాల్ నెహ్రూ.

జాతీయవాదులలో భేదాభిప్రాయాలు పనికిరావనియు, ఐకమత్యంతో ఎటువంటి కార్యాన్నయినా అవలీలగా సాధింపగలమనియు - ఆ మహాసభలో పాల్గొని, మన జవహరులాలు నెహ్రూ - ప్రజానీకాన్ని, నాయకుల్ని హెచ్చరించాడు. ఆ సంవత్సరమే (1927) అఖిల భారత కాంగ్రెసు మహాసభలో ప్రముఖపాత్ర (కార్యదర్శియై) ధరించి - 'విదేశ వ్యవహారాల విషయంలోను, ఆచరించే విధానాలలోను' - నూతన మార్గాలు ఏర్పఱచాడు. ఆ మార్గాలను తిలకించగానే, నాయకులలోను యువక వీరుల లోను నూతనోత్సాహం బయలుదేరింది.



# 1928 సైమన్ కమీషన్, లక్నో

1928వ సంవత్సర ప్రారంభంలో 'సైమన్ కమీషన్'వారు లక్నో వచ్చారు. సైమన్ కమీషన్ అనగా, 10 సంవత్సరములకు ఒకసారి మన దేశాన్ని పరిశీలించి, మార్పులు చేయవలసివస్తే చేయుటకు ఇంగ్లీషువారు ఏర్పరచిన ఒక సంఘం. దీనిలో ఏడుగురు (ఇంగ్లీషువారే) సభ్యులుగా ఉంటారు. 'సర్ జాన్ సైమన్' ఈ సంఘానికి అధ్యక్షుడు. కాబట్టి దీనికి 'సైమన్ కమీషన్' అను పేరు వచ్చింది. ఇది 1918 సం॥లో ఏర్పడింది. దీనిలో ఒక్క భారతీయుడుకూడ సభ్యుడుగా లేడు.

అందువల్ల మన జవహర్‌లాల్ నెహ్రూ 'సైమన్ కమీషన్' రాకకు అసమ్మతిగా ఏర్పాటుచేసిన నల్లజండాల ఊరేగింపుదళానికి నాయకుడయాడు; గుఱ్ఱంపై ఆరోహించి, ఊరేగింపును నడిపించాడు.

ఆంగ్ల ప్రభుత్వం అందుకు ఆగ్రహించి, పోలీసులకు అధికారాలు ఇచ్చారు. వారు పెచ్చురేగి లాఠీలతో నెహ్రూను, వాలంటీర్లను దయా దాక్షిణ్యాలు లేకుండా హింసించారు. చివరకు నెహ్రూ తల్లియగు స్వరూపరాణిని కూడ లాఠీదెబ్బలకు గురిజేశారు. అయినా మనవారు ఓర్చుకొన్నారు.



పంజాబు కాంగ్రెసు నాయకుడగు లాలాలజపతిరాయిని పోలీసులు తీవ్రంగా గాయపరిచారు. ఆ తరువాత పదిరోజులకంటె ఎక్కువగా ఆ మహానుభావుడు జీవించ లేదు; శాశ్వతంగా కన్నుమూసివేసినాడు. ఈ భయంకర సంఘటన జవహరులాలు నెహ్రూను ఎంతగానో కలవరపరిచింది.

శాంతమూర్తి యగు గాంధీజీ ప్రియశిష్యుడు గదా! మన జవహరులాల్ నెహ్రూ. అందువల్ల ఎన్ని కష్టాలనైనా నవ్వుతూ ఎదుర్కోవాలనీ, కార్యం సాధించా

లనీ నిశ్చయించుకొన్నాడు. ఆ పట్టుదల తోనే 'సైమన్ కమీషన్' బహిష్కారం కొనసాగించాడు. దేశ మంతటా విజయ భేరీ మ్రోగించాడు

అదే సంవత్సరం హిందూ ముస్లి ముల మధ్య స్నేహానురాగాలు సాధించేం దుకు ప్రయత్నాలు జరిగాయి. తత్ఫలితంగా ఆగస్టు నెల (1928)లో అఖిల పక్ష సమా వేశం జరిగింది. ఆ సభకు మోతీలాలు నెహ్రూ అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు. దానిలో కూడ జవహరులాలు నెహ్రూ పాల్గొన్నాడు. కానీ, ఆయనలో సుము ఖత్వంమాత్రం లేదు. అది గాంధీజీకి కష్ట మనిపించింది ఎట్లాగైతేనేం! ఎట్టకేలకు మన జవహరుకూడా 'నెహ్రూ నివేదిక'పై సంతకం చేశాడు. గాంధీజీ సంతోషించాడు. ఆ సంతోష సమయంలోనే గాంధీజీ నాగ పూరులో జరుగబోవు కాంగ్రెసు అధ్యక్ష పదవికి జవహర్లాలు పేరును సూచించాడు.



## 1929 - నెహూ్రి కాంగ్రెసు అధ్యక్షపదవి, నాగపూరు

1929 వ సంవత్సరంలో 'అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు మహాసభ' నాగపూరులో జరిగింది. ఆ మహాసభకు నెహూ్రజీ అధ్యక్షత వహించారు. 'సంపూర్ణ స్వాతంత్ర్యమే మన ఏకైక లక్ష్యం' అని ఆ మహాసభలో ఎలుగెత్తి వినిపించాడు.

1930 సం॥లో సహాయ నిరాకరణోద్యమం బయలుదేరింది. ఇందుకు కారణమేమనగా. 1929 కాంగ్రెసుమహాసభ తీర్మానము మేరకు తెల్లదొరలకు జాతీయ నాయకులు ఒక ఏడాది గడువు నిచ్చినారు. కానీ, 1930 నాటికి కూడా వారిలో ఎట్టి అలజడియు గోచరింపలేదు. కాబట్టి 1930 లాహోరు కాంగ్రెసు మహాసభలో "శాసనోల్లంఘము" చేయుటకే జాతీయ నాయకు లందరును తీర్మానించుకొన్నారు.

"1930 జనవరి 26వ తారీఖున" బ్రహ్మాండమైన కాంగ్రెసు మహాసభ జరిగింది. ఆ మహాసభలో భారతదేశము స్వాతంత్ర్య దినముగా ఎన్నుకోబడి ప్రకటించ బడింది. అందువల్లనే ప్రతి వత్సరము జనవరి 26వ తేదీ "ప్రజా ప్రభుత్వ దినము" (రిపబ్లికు డే)గా ఎన్నుకొంటున్నాము.

### మహాత్ముని సంకల్పం

అదే సంవత్సరం (1930) లో గాంధీమహాత్ముడు గుజరాతుదేశములో 'దండి' గ్రామమున 'ఉప్పు సత్యాగ్రహము' చేయుటకు సంకల్పించుకొన్నాడు. అప్ప

టికి మహాత్ముడు సబర్మతీ ఆశ్రమమునందు (ఇది అలహాబాదునకు సమీపములో ఉన్నది.) ఉన్నాడు. మహాత్ముడు తన సంకల్పాన్ని అప్పటి రాజప్రతినిధికి (ఇర్విన్ ప్రభువుకు) తెలియజేశాడు; తన కార్యాన్ని ముందుకు సాగించినాడు.

## మోతీలాలు నెహూర్రి త్యాగగుణము

మహాత్ముని దండి యాత్ర నెహ్రూలకు అందినది. వెంటనే మోతీలాలు నెహ్రూ, జవహర్‌లాలు నెహూర్రు 'జంబూసరం' అను చోటుకు వచ్చి మహాత్ముని కలిసికొన్నారు. చేయవలసిన విధానాన్ని గూర్చి బాగా ఆలోచించారు. ఆ సందర్భంలోనే మోతీలాలు నెహూర్రి తమ అమూల్యమైన 'ఆనందభవనాన్ని' కాంగ్రెసు సంస్థకు బహూకరించాడు. అప్పటినుండి అది 'స్వరాజ్యభవనం'గా వాడుకలోనికి వచ్చింది.

## 1930 - ఉప్పు సత్యాగ్రహం (దండి)

ఉప్పు సత్యాగ్రహం ప్రారంభం అయింది. స్త్రీలుకూడ పెక్కుమంది అందులో పాల్గొన్నారు. ఈ వార్త ఆలకించి, దేశం నలుమూలలనుండీ నాయకులు, ప్రజలు వచ్చి ఆ యుద్యమంలో పాల్గొన్నారు. స్త్రీలుకూడ అనేక మంది ఈ ఉప్పు సత్యాగ్రహ సమరంలో దూకారు. వారిలో ముఖ్యంగా చెప్పదగినవారు కమలా నెహ్రూ, కృష్ణా హథీసింగ్ (జవహర్‌లాలు రెండవ చెల్లెలు), సరోజినీదేవి నాయుడు మొదలగు మహిళామణులు.

ఈ ఉద్యమం గాంచి, ప్రభుత్వము కళ్ళెఱ్ఱజేసింది. పోలీసు దళానికి అనుమతిచ్చింది దానితో 144వ సెక్షను అమల్లోనికివచ్చింది. అందువల్ల పోలీసులు విజృంభించి, నాయకులను - ప్రజలను లాఠీదెబ్బలకు గురిచేశారు. ప్రముఖ నాయకులందరును బంధింపబడి చెరసాల్లో ఉంచబడినారు. అప్పటి పత్రికలు 'ఈ ఉద్యమంలో పోలీసు తుపాకి గుండ్లకు బలియైనవారు దేశం మొత్తంలో వందల సంఖ్య దాటినది; జైళ్ళకు వెళ్ళినవారు ఒక లక్ష మంది; గాయపడినవారు 10 వేల మంది' అని ప్రకటించాయి.



ఈ సందర్భంలో మధ్యపరగణాలలోని రాయపురమున కేగుచున్న జవహరులాలు నెహ్రూను శాసనోల్లంఘనము చేసినాడను నేరముపై ప్రభుత్వం ఆయ



నను బంధించింది. ఆయనతోపాటు సుభాసు మరికొందరు నాయకులు కూడ బంధింపబడినారు.

విదేశవస్తు బహిష్కార సమయమున భారతదేశమంతటను తీవ్రమైన సంచలనం బయలుదేరింది. విదేశ వస్తువులను, విదేశ వస్త్రములను కొనరాదనియు, అమ్మరాదనియు, మనవారందరు ఆ యా దుకాణముల ముందు నిలిచి, ఎలుగెత్తి ప్రకటించారు. ఆ శాసనోల్లంఘ కార్యక్రమములో నెహ్రూ కుటుంబ మంతయును పని చేసినది. అప్పటి జాతీయావేశంలో వృద్ధురాలైన నెహ్రూ తల్లి స్వరూపరాణికూడ కార్యరంగంలోనికి దూకినది. విజయలక్ష్మి పండిట్, కమలానెహ్రూ, కృష్ణా హథీసింగ్, మరియు ననేకమంది గౌరవ కుటుంబములలోని యువతీమణులు విదేశ వస్తువులను అమ్ము అంగళ్లముందు గంటలతరబడి నిలబడి తమ కార్యాన్ని కొనసాగింపగల్గారు.



అప్పటికి నెహ్రూ జయిల్లో ఉంటున్నాడు. ఆయన నిత్యం నూలు వడకడం, భగవద్గీత పారాయణ చెయ్యడం, తీరిక సమయాల్లో లేఖలు వ్రాయడం ఆయన పని. ఇట్టి స్థితిలో జవహరు తన కుటుంబము సల్పిన విదేశవస్తు బహిష్కార ఉద్యమం సంగతి విని ఎంతో మురిసిపోయాడు. 'తండ్రి, తల్లి, సోదరీమణులు, భార్య అందరూ దేశసేవలోనికి దిగినారు' ఆహా! నేడెంత సుదినం! ఇంత మంచి వార్త విన్నాను' అని జవహరు ఎంతగానో సంతోషించినాడు.

## 1931 - మోతీలాలు నెహ్రూ నిర్యాణం

జవహర్‌లాల్ నెహ్రూ తండ్రియైన మోతీలాలు నెహ్రూకు అప్పటికి 70 ఏండ్లు నిండాయి. వయోవృద్ధుడైనాడు. అయినప్పటికీ శాసనోల్లంఘన ఉద్యమంలో

సింహకిశోరంలా విజృంభించాడు. ఫలితం ? ప్రభుత్వం ఆయనను బంధించి ఆరు నెలలు శిక్ష విధించింది ; నైనిటాల్ సెంట్రల్ జయిల్లో ఉంచారు. ఆయనతోపాటు సయ్యేదు మహమ్మూద్ (ఈయన చాల కాలంగా నెహ్రూ కుటుంబానికి ఆప్తమిత్రుడు ; జవహర్ లాల్ నెహ్రూకు సహధ్యాయి కూడ. మరియు భారతదేశ విదేశాల వ్యవహారాల శాఖ మంత్రి) కూడా అరెస్టు ఐనాడు. ఇరువురినీ నైనిటాల్ జయిల్లోనే ఉంచింది ప్రభుత్వం. అదే జయిల్లో జవహర్‌లాల్ కూడ ఉన్నాడు. ఇది 1930 సంవత్సరమునాటి సంగతి.



క్రమంగా మోతీలాలు అనారోగ్యమువల్ల క్షీణించసాగాడు. అందువల్ల ఆయనను 1930 సెప్టెంబరు నెలలో విడుదల చేశారు. అక్టోబరు మాసంలో జవహరును విడుదల చేశారు. కానీ, మోతీలాలు నెహ్రూకు 1931 ఫిబ్రవరి నెలలో రోగం ముదిరింది. అదే నెల 6వ తారీఖున ఆయన కన్ను మూశాడు.

మోతీలాలు నెహ్రూ మరణం ఒక్క కుమారునే (జవహరులాలు నెహ్రూనే) గాక, భారతీయులందరినీ శోకసముద్రంలో ముంచివేసింది. మోతీలాలు నెహ్రూ ఆఖరి గడియలలో గాంధీజీ ఆయన ప్రక్కనే ఉన్నాడు. మోతీలాలు మరణానంతరం జవహరు లాలుకు తండ్రి లేని లోటు గాంధీజీవల్లనే తీరింది ; గాంధీజీ ఊరడింపుతో మనశ్శాంతి కూడ కలిగింది. కానీ, 'తగిలిన కాలికే తగులుతుంది దెబ్బ' అన్న సామెత మన జవహరుపట్లకూడ సార్థక మయింది. తండ్రి మరణం యింకా మనస్సులో మెదలుతూనే ఉంది ; అంతలోనే జవహరుకు (1936)లో సతీవియోగంకూడా సంభవించింది.

## 1936 - కమలా నెహ్రూ నిర్యాణం

1934 సంవత్సరంలో బీహారు భూకంపం జరిగింది. ఆ సందర్భంలో నెహ్రూజీ భూకంప బాధితులకు అనేక సౌకర్యాలు కలిగించాడు. దేశం నలుమూలల నుండీ విరాళాలు సంపాదించాడు. ఆ సందర్భంలో ఆయన కలకత్తాలో తెల్లవారి కుళ్లును వెల్లడిస్తూ 'గంభీరోపన్యాసం యిచ్చాడు. అందువల్ల ఆయనకు రెండేండ్లు శిక్ష పడింది. 'అల్మోరా'లోని జిల్లా జైలులో ఉంచారు. ఆ అల్మోరా జయిలులోనే నెహ్రూజీ తన 'ఆత్మకథ'ను వ్రాసుకొన్నాడు.

1935వ సంవత్సరంలో జవహర్లాల్ నెహ్రూ భార్య కమలా నెహ్రూ ఆరోగ్యము చెడి విషమించింది. కాబట్టి ఆమెను డాక్టర్లు స్విట్జర్‌లాండుకు చేర్చారు. అప్పటికి వారి పుత్రిక యగు ఇందిరాగాంధి అచ్చటనే చదువుకొనుచున్నది.

కమలానెహ్రూ అనారోగ్యం డాక్టర్లనే కాక, దేశనాయకు లందరినీ కలవర పరిచింది. వెంటనే వారు ప్రభుత్వానికి కమలానెహ్రూ అనారోగ్యం తెలియజేస్తూ జవహరును విడుదల చేయవలసిందిగా కోరారు. ప్రభుత్వం విధిలేక జవహరులాల్‌ను 1935 సెప్టెంబరు నెలలో విడుదల చేసింది. నెహ్రూజీ వెంటనే విమానంలో స్విట్జర్ లాండుకు చేరుకొన్నాడు. భార్యపరిస్థితి కండ్లారా తిలకించాడు. అక్కడ పెద్ద డాక్టర్లు అందరిచేతను వైద్యం చేయించాడు. తానుకూడా స్వయంగా భార్యకు పరిచర్య



చేశాడు. వేళకు మందు ఇవ్వడం, పండ్లరసాలు అందివ్వడం, ఆమెకు సహాయంగా పండుకోవడం—ఒకటేమిటి? తాను ఒక నర్సులాగ భార్యకు సేవ చేశాడు. ఇందుకు ఫలితంగా భార్య ఆరోగ్యం కొంచెం చక్కబడింది. నెహ్రూ ఆనందించాడు. ఇక ఫర్వాలేదని ధైర్యంకూడా పొందాడు. కానీ, విధి లిఖితం ఎవరు తప్పించగలరు? ఆ తరువాత కొద్దిరోజులకే అనగా 1936, ఫిబ్రవరి 28వ తేదీన కమలానెహ్రూ దివినలంకరించింది. ఆమె అంత్యక్రియలు ముగిశాక నెహ్రూజీ మార్చి నెలలో స్వదేశానికి చేరుకొన్నాడు.



## రవీంద్రునితో నెహ్రూ

సతీవియోగం మరవడానికి కొన్ని నెలలు విశ్వకవి రవీంద్రుని చెంత గడపుటకు నిశ్చయించుకొన్నాడు నెహ్రూ. కలకత్తా (శాంతినికేతన్‌కు) వెళ్ళి ఆయనను దర్శించి, అమూల్య సలహాలను తలదాల్చాడు. ఆ తరువాత రెండు సంవత్సరములకే (1938లో) నెహ్రూజీ తల్లియగు స్వరూపరాణికూడ కొడుకునకు దూరమయింది.

# 1939 నెహ్రూజీ చైనా ప్రయాణం

తల్లి మరణంతో నెహ్రూ ఎంతో కుమిలిపోయాడు. మానసికంగా క్రుంగిపోయాడు. అందువల్ల కొంతకాలము విశ్రాంతి పొందాలని యూరప్పుదేశాలు పర్యటించాడు. 1939 సం॥ లో తిరిగి వచ్చాడు. అప్పటికి సుభాసుబోసు, గాంధిజీల మధ్య సామరస్యం లేదు. శాంతి కాముకుడైన నెహ్రూజీ సామరస్యం సాధించడానికి పూనుకున్నాడు. వ్యక్తిగతంగా సుభాసు - గాంధీజీలను కలిసి, ఏకైకలక్ష్యాన్ని, శాంతిని కలిగించడానికి మాటలాడాడు. కానీ, ఆయన ప్రయత్నం నెరవేరలేదు. సుభాసుబోసు పూర్తిగా తన అధ్యక్షతపదవికి రాజీనామా ఇచ్చి, తప్పుకొన్నాడు ; వెంటనే ''ఫార్వర్డు'' బ్లాకు స్థాపించాడు.



సుభాసుబోసు అఖిలభారత కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా ఇవ్వగానే, ఆయన స్థానంలో డాక్టరు రాజేంద్రప్రసాదు ఎన్నుకోబడ్డాడు. సుభాసుబాబు రాజీనామా జవహరుకు ఎంతో ఆశాభంగం కలిగించింది. క్రొత్త కార్యవర్గంలో పాల్గొనడానికి మనస్సు అంగీకరింప

లేదు. ఒకవైపు గాంధీజీ ఒత్తిడి; మరొకవంక మనస్సుకు శాంతి లభింపకపోవడంతో జవహరు ఎంతో తికమకపడ్డాడు.

ఈ సమయంలో అప్పటి చైనానేతయగు మార్షల్ చాంగ్ కైషేక్, ఆయన సతీమణి మదాంచాంగ్ గార్ల వద్దనుండి నెహ్రూకు "తమ దేశానికి 'అతిథి'గా రమ్మని" ఆహ్వానం వచ్చింది. ఈ ఆహ్వానం జవహరుకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. "కొంతకాలం అక్కడ గడపి రావచ్చు" నని ఆయన వెంటనే చైనాదేశానికి అతిధిగా వెళ్లాడు.

## 1939 రెండవ ప్రపంచ సంగ్రామం

నెహ్రూజీ చైనా పర్యటనలో నున్న తరుణమందే యూరప్పుఖండములో యుద్ధజ్వాల చెలరేగినది. ఈ వార్త చెవిని బడగానే నెహ్రూజీ తన పర్యటన కార్యక్రమాన్ని ముగించుకొని భారతదేశానికి చేరుకొన్నాడు.

ఆ మహా సంగ్రామంలో బ్రిటిషువారికి సహాయంచేయడం మన భారతీయుల ముఖ్యధర్మ మని నెహ్రూజీ నిశ్చయించుకున్నాడు. అయితే "భారతదేశానికి స్వాతంత్ర్యం కావాలి." స్వాతంత్ర్యం ఉన్ననాడే ఏ విధమైన సహాయమైనా, త్యాగమైనా చేయడానికి వీలు అవుతుంది. ఈ సంకల్పంతో నెహ్రూజీ తదితర దేశనాయకు



లగు మౌలానా ఆజాద్, రాజగోపాలాచారి, డాక్టర్ రాజేంద్రప్రసాదు, వల్లభభాయి పటేలు మొదలగువారితో సంప్రతించాడు. వారందరూ నెహ్రూ సంకల్పాన్ని బలపరిచారు. రాజగోపాలాచారి ఈ విధంగా అన్నాడు :



"హిట్లరు యిప్పుడు చాల బలవంతుడై యున్నాడు. దేశం తర్వాత దేశంగా ఆక్రమించుతూ వస్తున్నాడు. ఫ్రాన్సు లొంగిపోయింది; జర్మనీ క్రుంగిపోయింది. ఈ స్థితిలో భారతదేశం బ్రిటనుకు సాయం చేయడం ధర్మమే కానీ, భారతదేశానికి స్వేచ్ఛ ఉన్ననాడే అన్నివిధలా తోడ్పడవచ్చును."

రాజాజీవంటి అనుభవజ్ఞుడుకూడ నెహ్రూ సంకల్పాన్నిగురించి మెచ్చుకోవడంతో, నెహ్రూలో మఱింత ఉత్సాహం బయలుదేరింది. ఈ విషయం వైస్రాయి (లిన్‌లిత్‌గో)కి తెలియజేయబడింది. కానీ, అతడు అంగీకారం ప్రకటింపలేదు. అందువల్ల గాంధీజీ స్వయంగా వైస్రాయితో సంప్రతింపులు జరిపాడు. అయినా, లాభం లేకపోయింది. ఈ కారణంచేత 1941లో గాంధీజీ భారతదేశ స్వాతంత్ర్యానికై 'వ్యక్తి సత్యాగ్రహ' పోరాటాన్ని ప్రారంభింపచేశాడు.

ఈ 'వ్యక్తి సత్యాగ్రహోద్యమానికి' మొదటి నాయకుడు ఆచార్య వినోబా భావే. రెండవ నాయకుడు నెహ్రూజీ. ప్రభుత్వం ఈ ఉద్యమానికి ఆగ్రహించి వినోబా భావేను అరెస్టుచేసింది. ఇదే కార్యక్రమంలో సర్దార్ పటేలు, మౌలానా అబుల్

కలామ్ అజాదు మొదలగు నాయకులు కూడ బంధింపబడ్డారు. ఇట్లు ఒకరి వెంబడి ఒకరుగా సత్యాగ్రహులు ఇరువదిమూడువేల మంది జైళ్లలో బంధింపబడ్డారు. ఈ సందర్భంలో ప్రభుత్వం నెహ్రూజీనికూడ అరెస్టుచేసి, న్యాయస్థానానికి పంపించింది. న్యాయమూర్తి నాలుగేండ్లు శిక్ష విధించాడు నెహ్రూజీకి.

నెహ్రూజీ ఏమీ భయపడలేదు. ఆయన ఇలా అన్నాడు. "జైలు శిక్ష అనుభవించడం ఇది ఎనిమిదవసారి. ఈ జైలు నరకానికి నేను అలవాటు పడినవాడనే. కానీ, ఈ సమయం చాల స్వల్ప మయినది. నన్నొకణ్ణి విచారించితే సరికాదు; ఎవరి ఆత్మను వారు విచారించుకొంటే సత్యం గోచరిస్తుంది. నాతో ఈ ఉద్యమం ఆగిపోతుందని అనుకోవడం చాల తెలివితక్కువ. భారతమాత కన్న బిడ్డలు కోటాను కోట్లు ఉన్నారు. ఈ మాట మాత్రము మఱచిపో కూడదు."

నాయమూర్తి నెహ్రూభావానికి లోలోపలనే అంజలి ఘటించాడు. కానీ, ప్రభుత్వాజ్ఞను ధిక్కరించే స్తోమత లేనివాడగుట వలన, నెహ్రూకు నాలుగేండ్ల కఠినశిక్ష విధించాడు. ఈ శిక్ష విని చర్చిల్ వంటి ధీరుడుకూడ చాల బాధపడినాడట !-

## 1941 పెరల్ హార్బరుదాడి - నెహ్రూ విడుదల

ప్రపంచయుద్ధం తీవ్రంగా సాగిపోతూంది. జపానువారు పెరల్ హార్బరుపై దాడి చేశారు. ఈ దెబ్బతో అమెరికావారు కూడ యుద్ధరంగంలోకి దిగినారు. బ్రిటిష్

ప్రధాని చర్చిల్‌కు సానుభూతిఅయితే ఉందిగాని, భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడం మాత్రం ఇష్టంలేదు. కానీ, అమెరికా సల్పిన ఒత్తిడికి అతడు తట్టుకోలేకపోయాడు. అందువల్ల స్టాపర్డు క్రిప్సును ఇండియాకు పంపించాడు సంధి కుదర్చడానికి. అది కారణంగా కాంగ్రెసు నాయకుల నందరినీ బ్రిటిషు ప్రభుత్వం విడుదల చేయవలసి వచ్చింది; నెహూౄ కూడ విడుదల అయినాడు.

జపానువారు క్రమముగా హాంగ్‌కాంగ్, ఫిలిప్పైన్, మలయా, సింగపూరు, థాయిలాండ్‌లను వశం చేసికొన్నారు; భారతదేశం సరిహద్దుల్లోకి వచ్చారు. "మనం మనం ఏకమయితే బ్రిటను నశించడానికి రెండుక్షణాలు చాలు" అని కూడ వారు రాయబారం నడిపించారు.

కానీ, నెహూౄజీ అందుకు చేయి కలపలేదు. బ్రిటిషువారు భారతీయులను ఎంత కష్టపెట్టుచున్ననూ మిత్రరాజ్యాలపై గల మైత్రి చెడలేదు జవహరుకు.

## 1942 - క్రిప్సు రాయబారం

ఆ సమయంలోనే భారతదేశం ఆహ్వానంపై చైనా రాజ్యాధినేత యగు మార్షల్ చాంగ్ కైషేక్ తన సతీమణి మదాం చాంగ్‌తో భారతదేశానికి విచ్చేసినాడు. నెహూౄజీ వారికి తగిన గౌరవంతో స్వాగతం యిచ్చాడు. తరువాత ఆయనతో నెహూౄజీ ఇలా అన్నాడు.

సమరం విజయవంతం కావాలంటే, భారతదేశంకూడా సంగ్రామంలోకి దూకాలి. దూకాలి అంటే దానికి స్వాతంత్ర్యం రావాలి. కాబట్టి భారతదేశానికి అధికారం అప్పగించవలసిన బాధ్యత బ్రిటనుపై ఎంతైనా ఉంది. మార్గం ఒకటే. దీనికి చర్చిల్ అంగీకరించునట్లు రూజ్వెల్టు (అమెరికా అధ్యక్షుడు) చేత మనం సందేశాన్ని పంపాలి.''

ఈ విషయంపై వారు దీర్ఘంగా ఆలోచించి రూజ్వెల్టుకు తమ కోరికను విశదీకరించారు. తత్ఫలితంగా స్టాఫర్డు క్రిప్సు భారతదేశ సామరస్యానికి ఢిల్లీ విచ్చేసినాడు. నెహ్రూజీకూడ ఈ రాయబారంలో ప్రముఖపాత్ర వహించినాడు. కానీ, ముస్లింలీగు నాయకుడగు జిన్నా ప్రచారంవల్ల ఈ రాయబారాలు ఏమీ కొనసాగలేదు.

## 1942 - క్విట్ ఇండియా నినాదం

క్రిప్సు రాయబారం ఫలితానికి ఎప్పుడైతే రాలేదో అప్పటినుంచి కాంగ్రెసు వీరులలో మరింత ఉద్రేకం పెచ్చుపెరిగిపోయింది. "స్వాతంత్ర్యం ఇస్తారా? ఇవ్వరా? ఏదో ఒకటి తేలిపోవాలి'' అన్న నిశ్చయానికి వచ్చారు; గాంధీజీ 'క్విట్ ఇండియా' నినాదాన్ని పూరించాడు. బ్రిటిషువాళ్ళు ముల్లె మూట కట్టుకొని తమ దేశానికి వెళ్ళిపోవాలని దీని భావం.

బ్రిటిషువారు నక్క జిత్తులు ఉపయోగించారు. గాంధీజీ - నెహ్రూజీలను మంచిమాటలతో మచ్చిక చేసుకొన్నారు. మీకోరికప్రకారం చేస్తామని హామీ ఇచ్చారు;

రైలు ఎక్కించారు. గాంధీజీని పూనాలో ఆగాఖాన్ భవనంలో ఎవరికి తెలియకుండా బంధించారు. ఆయనతో సరోజినీదేవికూడ ఆదే భవనంలో ఉంచబడినది.

నెహ్రూను అహమద్‌నగర కోట జైలులో ఉంచారు. ఆయనతో మౌలానా ఆజాద్, పటేలు, కృపలానీ, నరేంద్రదేవు మున్నగు నాయకులు కూడ అందే బంధింపబడినారు.

## భారతీయుల విజృంభణ

ఎప్పుడైతే నాయకులు కనబడలేదో, అప్పుడే భారతీయులలో గల శౌర్యం అగ్నిజ్వాలగా పైకి చెలరేగింది. 'కార్యం సాధించడమో, లేక ఆ కార్య సాధనలో చావడమో! ఏదో ఒకటి కావాలి' అని భారతీయులు రంగంలోకి దూకినారు.

భారతీయాగ్నిజ్వాల ఒకవిధమైన కొత్తపంథాగా తిరుగుబాటుచేసింది. పోలీసు స్టేషన్లపై, రైల్వే స్టేషన్లపై, ప్రభుత్వ కార్యాలయాలపై తిరుగుబాటు సాగించింది. దేశ మంతటా కొన్ని నెలలు అశాంతి పెచ్చుపెరిగి తాండవ మాడింది. ఈ అలజడితో తెల్లప్రభుత్వానికి భారతీయుల శక్తి బాగా తెలిసివచ్చింది.

నెహ్రూజీ 1942 నుండి 1945 వరకూ అహమద్‌నగర్ కోట జైలులో జీవితం అనుభవించాడు. ఇదే ఆయన ఆఖరి జైలు జీవితం. చాలాకాలం కూడ. ఈ మూడేండ్ల కాలంలోను నెహ్రూజీ నూలు వడకడం, గ్రంథ రచన అనునవి ప్రధానంగా

ఎంచుకున్నాడు. 'భారత దర్శనం' అను గ్రంథం అప్పుడు రచించినదే. ఆ గ్రంధాన్ని ఆయన చాలవరకు జయిలులోనే పూర్తిచేశాడు. మిగిలినది జైలునుండి విడుదలయాక, పూర్తిచేశాడు.

## 1946 - తాత్కాలిక ప్రభుత్వం

1946 సం॥నాటికి భారతదేశానికి వైసాృయిగా వేవెల్ ప్రభువు నియమించబడినాడు. అప్పటికి బ్రిటనులో కార్మిక పక్షము పార్లమెంటు ఎన్నికలలో విజయం పొందింది. క్లెమెంట్ అట్లీ బ్రిటిష్ ప్రధానిగా నియమింపబడ్డాడు. అతడు 'సాధ్యమైనంత త్వరగానే భారతదేశానికి స్వాతంత్ర్యం కలిగేలాగ చూస్తానని హామీ ఇచ్చాడు. కానీ, అప్పటికి ముస్లింలీగు - కాంగ్రెసుల మధ్య సామరస్యంలేదు. దానిని సాధించేందుకు విశ్వప్రయత్నాలు చేసినాడు నెహ్రూజీ. కానీ, జిన్నా ప్రతి యత్నానికి అడ్డు తగులుతూ ఉండేవాడు. భారతయుద్ధరంగంలో పద్మవ్యూహం ఛేదించడానికి సైంధవుడడ్డుపడినట్లు - జిన్నా భారత స్వాతంత్ర్యానికి అడుగడుగునా అడ్డు తగులుతూ ఉండేవాడు. అయినప్పటికీ నెహ్రూజీ తన పట్టుదలను విడిచిపెట్టలేదు.

కాంగ్రెసు-ముస్లింలీగుల మధ్య స్నేహానురాగాలను వృద్ధిచేయాలని వేవెలు (వైస్రాయి) ఆలోచించి, తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచుటకొరకై రమ్మని 1946 సెప్టెంబరు నెలలో ఆహ్వానించాడు. నెహ్రూజీ దానికి సమ్మతించి - వెళ్లివచ్చాడు.

తరువాత క్రొత్తప్రభుత్వం ఆచరింపబోవు విధానాలన్నీ "ఆలిండియారేడియో" ద్వారా భారతీయుల కందరికీ తెలియజేశాడు.

1946 సెప్టెంబరు 2వ తేదీనాడు పండిత జవహరులాలు నెహ్రూ భారత దేశ తాత్కాలిక ప్రభుత్వానికి ప్రధాని అయాడు. ఆ తరుణంలో గాంధీజీ ప్రజలను హెచ్చరిస్తూ ఇలా ప్రకటించాడు. "నెహ్రూజీ కిరీటం లేని రాజు. ఆయనకు మీరంతా సహాయంగా నిలబడిఉండాలి. త్వరలోనే అధికార మంతా మన చేతికి రాగలదు."

క్రొత్త ప్రభుత్వంలో స్వయంగా లార్డు వేవెల్ ఎంతో కష్టించి, ముస్లింలీగు సభ్యులను చేర్పించాడు. కానీ, ప్రభుత్వంలో చీలికలు బయలుదేరాయి. అందువల్ల





నెహ్రూజీ చాల కలతచెందాడు; ఎట్లయినా అందరినీ ఒకేబాట పట్టించాలని పట్టుదలతో పనిచేశాడు. అందుకు ఫలితంగా లండనునుంచి - నెహ్రూ-జిన్నాలకు ఆహ్వానం వచ్చినది. నెహ్రూజీ, రక్షణశాఖా మంత్రి బలదేవుసింగుతోను; జిన్నా, ఆర్థికశాఖా మంత్రి

లియాఖత్ అలీఖాన్‌తోను లండనుకు వెళ్ళారు. కానీ, ఫలితంమాత్రం గోచరించలేదు. ఇందుకు కారణం జిన్నా కావించిన అసత్య ప్రచారాన్ని ఇంగ్లీషువారు విశ్వసించడమే.

1946 డిశంబరులో 'రాజ్యాంగ నిర్ణయ సభ' జరిగింది. దానికి ముస్లింలీగు సభ్యులు ఎవ్వరుకూడ హాజరు కాలేదు. దానితో జవహర్‌లాల్ నెహ్రూ ఉగ్రుడై పోయాడు. నిర్ణయ సభను బహిష్కరించినవారు ఇందుండి విరమించుకొన్నట్టే' అని బహిరంగంగా ప్రకటించాడు. అయినప్పటికీ, 'తాబట్టిన కుందేటికి మూడే కాళ్ళు' అను మొండి స్వభావం గల జిన్నా లొంగలేదు. 'ఐక్య భారతదేశం ఎట్టి పరిస్థితులలోను పనికిరాదు' అని ఘోషించాడు. పరిస్థితు లన్నియు చక్కగా సింహావలోకనం చేసిన ఉప ప్రధాని యగు వల్లభభాయి పటేలు 'దేశ విభజన జరిగితేనే బాగా ఉంటుం'దని తన భావాన్ని విశదీకరించాడు. గాంధీ - నెహ్రూలు మెత్తబడక తప్పిందికాదు.

## 1947 - భారతదేశ స్వాతంత్ర్యం

అందువల్ల గాంధీ - నెహ్రూలు భారతదేశ విభజనకు అంగీకరించారు. ఇంగ్లీషువారుకూడ 'భారతీయుల క్షేమమే మీకు ప్రధానమైనచో - జనసంఖ్యనుబట్టి - ఆయా ప్రాంతములను విడదీయుటయే మంచిదని' మన నాయకులను హెచ్చరించారు. తరువాత భారతదేశం రెండుగా చీలికలయింది. ఈ రెండుగా విభాగించు భారాన్ని మన వారు అనగా గాంధీజీ, నెహ్రూజీ, పటేలు, కృపలాని, జిన్నా, లాయిఖ్ అలీ మొదలగు వారు లార్డ్ మౌంట్‌బాటెన్‌పై మోపారు. ఇంగ్లీషువారుకూడ మౌంట్‌బాటెన్ ప్రభువే

అందుకు సమర్థుడని తలంచి - అతనికి అనుజ్ఞ యిచ్చారు. మౌంట్ బాటెన్ ప్రభువు తనకు సహాయకుడుగా 'రాడ్ క్లిప్' అను సేనాధిపతిని తీసికొన్నాడు. ఆ తరువాత ఆయన కొద్దిరోజులలోనే తనపై కార్యభారాన్ని దించుకొన్నాడు. భారతదేశము రెండు భాగములుగా విడదీయబడింది.

ఈ విధముగా దేశ విభజన జరిగి, 1947 ఆగస్టు 15వ తారీఖునాటికి భారత దేశం స్వతంత్రమైనది; ఆ రోజు భారతీయులకు పర్వదినమైనది. కానీ, మన నెహ్రూజీ వదనంలో మాత్రం మందహాసం కనిపించలేదు. దేశం రెండు ముక్కలయినందుకు ఎంతగానో బాధపడ్డారు.

ఢిల్లీకోటపై త్రివర్ణ పతాకం ఎగురవేస్తూ ఆయన ఇలా అన్నాడు.

"చిరకాలం నుండి మనం వాంఛిస్తూ వచ్చిన స్వాతంత్ర్యం నేడు మనకు లభించింది; సంతసింప దగినదే. కానీ, మనం వాంఛించినట్లు కాలేదు; శ్రీ జిన్నా పట్టుదల వల్ల భారతదేశం రెండు ముక్కలయినది. ఐక్యదేశంగా లభింప లేదు. అదియే నన్ను బాధించుచున్నది. అయినా మనం విచారింపదగిన అవసరమున్నూ లేదు. మన యత్నం మనం చేశాము; ఐకమత్యంతో మెలగవలసిన మనవారు మనకు కొంచెం దూరమయారు. పూర్వం మనం పలికిన మాటలను మననం చేసికొని, మన బాధ్యతను మనం నిర్వహించాలి. లోకం అంతా కన్నుమూసిన, ఈ అర్ధరాత్రి సమయాన మన దేశమాత - చిరకాలదాస్యం నుండి తప్పుకొని మనవంక చూస్తూ ఉంది. ఆమె

తన విచారాన్ని మఱచి పోయేటట్లు మనం ఐకమత్యంగా మెలగాలి. ఏక దీక్షతో కార్యక్రమాలు కొనసాగించాలి'' అని ప్రజలను, నాయకులను హెచ్చరించాడు నెహ్రూజీ.

## పంజాబు మత కలహాలు

భారతదేశ తొలి ప్రధానిగా నెహ్రూ ప్రమాణం స్వీకరించాడు. ఉప ప్రధానిగా సర్దార్ వల్లభభాయిపటేలు నియమింపబడినాడు. లార్డ్ మౌంట్‌బాటెన్ భారతదేశ గవర్నరుగా నియమింపబడ్డాడు. 1949-సం॥లో లార్డు మౌంట్‌బాటెన్ స్వదేశానికి వెళ్లిపోయాడు. ఆయన స్థానంలో శ్రీ సి. రాజగోపాలాచారి గవర్నరుజనరలుగా నియమింపబడినారు. భారతదేశ స్వాతంత్ర్య కారణంగా (దేశం రెండు చీలికలైనందున) పంజాబులో మతకలహాలు చెలరేగాయి. తూర్పు బెంగాలులోని 'నౌఖాళీ'లో కూడ హిందూ-ముస్లీం కలహాలు చెలరేగాయి. అట్లే బీహారులోకూడ విజృంభించాయి. అందువల్ల బాపూ నౌఖాళీకి, నెహ్రూజీ బీహారుకు వెళ్లడానికి నిశ్చయించుకొన్నారు. ముందుగా బాపూ నౌఖాళీకి వెళ్ళాడు. ఆయనతో కొంతమంది నాయకులు వెళ్ళారు. తరువాత నెహ్రూజీ ఉపప్రధానితోను, పాకిస్థాన్ ప్రధాని లియాఖత్ ఆలీఖానుతోను కలిసి - కలహాలు చెలరేగిన ప్రదేశాలన్నీ తిరిగాడు ; శాంతిని నెలకొల్పాడు.

ఆ సందర్భములో పంజాబు నుండి వచ్చిన కాందిశీకులకు, భారతీయులకు మతకలహాలు పెచ్చురేగాయి. ఈ దారుణదృశ్యానికి గాంధీ - నెహ్రూలు ఎంతగానో బాధపడ్డారు. ఆ కలహాలను అణచడానికి దీర్ఘంగా ఆలోచించారు. మార్గం గోచరించ



శ్రీ జవహర్ లాల్ నెహ్రూజీ - ప్రధాన మంత్రిగాను,
శ్రీ వల్లభ భాయి పటేలు - ఉప ప్రధానిగాను,
శ్రీ లార్డ్ మౌంట్ బాటెన్ - గవర్నరు జనరలుగాను
ప్రమాణం స్వీకరిస్తున్న దృశ్యం.



లేదు. చివరకు, గాంధీజీ 'ఆమరణ నిరాహార దీక్ష' వహించాడు. గాంధీజీ నిరాహార దీక్ష దేశాన్నంతా గగ్గోలు పరచింది. అటు మహమ్మదీయ నాయకులు, ఇటు భారతీయ నాయకులు ఏకమయారు. 'మే మన్న దమ్ములవలె ఐకమత్యంతో ఉంటాము. ఇక మీరీదీక్ష విడిచిపెట్టండి' అని స్వయంగా వచ్చి విన్నవించుకొన్నారు. వ్రాసి కూడా ఇచ్చినారు. గాంధీజీ ఆహారం తీసికొన్నాడు.

ఈ పై సంఘటనలో నెహ్రూజీ చూపిన నేర్పు, ఆతని అసాధారణమైన శక్తి వర్ణింప నలవి కానిది.

## 1948 - గాంధీజీ నిర్యాణము

హిందూ - మహమ్మదీయుల సఖ్యతకై విశ్వప్రయత్నం చేస్తూ, శాంతి కొరకై రాత్రింబవళ్ళు కష్టించే మహాత్ముడు, జాతిపిత ఐన గాంధీజీ ఆ సందర్భంలోనే



ఒక హిందూ మతోన్మాది తుపాకి గుండ్లకు బలియై పోయాడు.

గాంధీజీ మృతి విని నెహ్రూ కొయ్యబారిపోయి నాడు. పసిపిల్లవానిలా వెక్కి వెక్కి ఏడ్చాడు. పరిపూర్ణ మైన నిండు భక్తితో గాంధీజీ సమాధిపై పూలమాలవేస్తూ, తన ఆవేదనను ఈవిధంగా వెల్లడించుకొన్నాడు.

"భారతదేశ రత్నాన్ని పోగొట్టుకొన్నాను. నేను ముఖ్యపదవియందుండి కూడ మందమతినై ఆ రత్నానికి తగిన రక్షణ చేయలేకపోయాను; రక్షించుకొనలేక పోయాను" అని దురపిల్లాడు.

## 1948 - హైదరాబాదు పోలీసు చర్య

1948 ఫిబ్రవరి నెలలో నెహ్రూజీ భారతదేశ రాజ్యాంగ నీతిని ప్రకటించాడు. స్వదేశ సంస్థానాలన్నీ భారతదేశంలో కలిసిపోవాలని వెల్లడించాడు. అందుకు వ్యతిరే



కంగా తిరిగిన సంస్థానాలపై దండనీతి ఉపయోగింపబడింది. భారత దేశంలో కలిసిఉండడానికి హైదరాబాదు ప్రభుత్వము - (రజాకార్ దుండగీంద్రకు నాయకుడైన ఖాసింరజ్వీ వలలో జిక్కిన కారణంచే) ఎదురు తిరిగింది. అప్పట్లో నిజాం ప్రభుత్వంలో మంత్రిగా నుండిన శ్రీ బూరుగుల రామకృష్ణారావు 'భారత దేశంలో నిజాం రాజ్యాన్ని విలీనం చేయడమే శ్రేయస్కర'మని హితోపదేశం చేశాడు. కానీ, ఆ బోధ 'బూడిదపోసిన పన్నీరు' అయింది. పరిస్థితులన్నీ చక్కగా అవగాహన చేసికొన్న ఉప ప్రధాని, 'ఉక్కుమనిషి' అయిన వల్లభభాయి పటేలు చాకచక్యంతో నిజాం రాష్ట్రంపై పోలీసు చర్య జరిపించాడు. చౌదరి నాయకత్వంతో హైదరాబాదు ప్రభుత్వం తలవంచక తప్పినదికాదు.

హైద్రాబాదు భారతదేశంలో విలీనం ఆయాక, నెహ్రూజీ లండనుకు వెళ్లాడు. అక్కడ కామన్వెల్తు మహాసభలో పాల్గొని ఇలా అన్నాడు : "త్వరలోనే రిపబ్లిక్‌గా

తయారగుచున్న భారతదేశం కామన్ వెల్తులో సభ్యదేశంగా ఉండగలదు'' అని వాగ్దానం చేశాడు. ఆ సందర్భం లోనే నెహ్రూజీ బ్రిటిష్ ప్రధాని యగు 'అట్లీ'తో కాశ్మీరు సమస్య గురించి మాటలాడేడు.



అక్కడనుండి నెహ్రూ అక్టోబరు నెలలో పారిస్‌కు వెళ్ళాడు. అక్కడ జరుగుచున్న ఐక్యరాజ్యసమితి ప్రత్యేక సభలో పాల్గొని ''భారత దేశం - దాని భవిష్యత్తు'' గురించి దీర్ఘోపన్యాస మిచ్చాడు. తరువాత అక్కడివారు సల్పిన గౌరవ మర్యాద లను స్వీకరించి భారతదేశానికి తిరిగి వచ్చాడు.

భారతదేశానికి వచ్చిన నెహ్రూజీ తిరిగి డిశంబరునెలలో హైదరాబాదు నవాబును కలిసికొన్నారు. రాజ్యాంగవిషయాలగు గురించీ చర్చించారు.

1949 జనవరినెలలో ఆసియా మహాసభ జరిగింది, దానిని నెహ్రూజీయే ప్రారంభించాడు. తరువాత ఏప్రిల్ నెలలో కామన్వెల్తు ప్రధన మంత్రుల సభలో పాల్గొనడానికి లండన్ వెళ్ళాడు.



## 'బెర్నార్డ్‌షా'తో.

ఈ విధంగా నెహ్రూజీ విదేశ పర్యటనలు సల్పుచున్న తరుణమందే "బెర్నార్డుషా" వంటి ప్రముఖ ఇంగ్లీషు కవి పుంగవులను, విజ్ఞానవేత్తలను దర్శించేవాడు.

## డాక్టరేట్ బిరుదు

1949లో అమెరికా అధ్యక్షుడు ట్రూమన్‌యొక్క ఆహ్వానంపై నెహ్రూజీ అమెరికా వెళ్ళాడు. అక్కడి కాంగ్రెస్ సభ్యులతో దేశౌన్నత్యం గురించి అనేక విష

యాలను ముచ్చటించాడు. ఈ సంవత్సరమందే నెహ్రూజీకి కొలంబియా విశ్వవిద్యాలయంవారు 'డాక్టరేట్' బిరుదాన్ని ఒసగి గౌరవించారు. ఆ విశ్వవిద్యాలయానికి అధ్యక్షుడుగా "ఐసెన్‌హోవర్" ఉంటున్నారు. ఆయన చేతిమీదుగానే శ్రీ నెహ్రూజీకి సన్మానం జరిగింది.

## 1949 - నెహ్రూజీ షష్టిపూర్తి మహోత్సవం

పండిత జవహర్‌లాల్ నెహ్రూజీ షష్టిపూర్తి మహోత్సవము 1949 నవంబరు 14వ తారీఖున భారతదేశ మంతటా మహా వైభవంగా జరిగింది. ఆ మహోత్సవ వేళకలో శ్రీ నెహ్రూకు కానుకగా డాక్టర్ రాజేంద్రప్రసాదు మున్నగు నాయకులు ఒక అభినందన గ్రంథాన్ని సమర్పించుకున్నారు. అందు ప్రముఖులైన దేశీయులు, విదేశీయులు నెహ్రూజీ దేశసేవను కొనియాడుతూ వ్రాసిన వ్యాసాలు కొల్లలుగా ఉన్నాయి.



## 1950 - రిపబ్లిక్ డే

1950 జనవరి 26వ తేదీన భారతదేశం రిపబ్లిక్‌గా అయింది. 1951లో




కాంగ్రెసులో గల అతివాదులకు, మితవాదులకు భేదాభిప్రాయాలు కలిగాయి వీరికి నాయకులు టాండన్, మరియు నెహ్రూజీలు. టాండన్ అప్పటికి కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్నాడు. అయినను, టాండన్ లోబడక తప్పిందికాదు. ఆ పదవిని నెహ్రూజీయే స్వీకరించాడు; క్రొత్త కార్యవర్గాన్ని నియమించాడు. డాక్టరు రాజేంద్ర ప్రసాదు రిపబ్లిక్ ప్రథమ అధ్యక్షుడు (రాష్ట్రపతి)గా నియమింపబడినాడు. ప్రస్తుతం రాష్ట్రపతిగా ఉంటున్న శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఇంతకుముందు అనగా 1952 నుండి ఉపరాష్ట్రపతిగా ఉండేవారు. రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్ స్వర్గీయులైన తరువాత - వీరు రాష్ట్రపతిగా ఎన్నుకోబడ్డారు. ఉపరాష్ట్రపతిగా శ్రీ జాకిర్ హుస్సేను ఉంటున్నారు.

## వనమహోత్సవము

నెహ్రూజీ ఇటు రాజకీయ విషయాలలో మునిగిపోతూ ఉన్నప్పటికీ - బాలల శ్రేయోభికరములగు వేడుకలలో కూడ పాల్గొనేవాడు. బాలలంటే ఆయనకు అంత ప్రేమ.



ఇదే సంవత్సరం అంటే (1951)లో మిల్క్ కాలనీ, బొంబాయి వారిచే ఏర్పాటు గావించబడిన వన మహోత్సవానికి నెహ్రూజీ అధ్యక్షత వహించారు. ఆ సందర్భంలో ఆయన స్వయంగా ఒక గులాబీ అంటును నాటుచు ఇలా అన్నారు.

"మృదువుగా, అందముగా నిగనిగలాడే గులాబీ పూలు, బాలలు అంటే నాకెంతో ప్రీతి. ఈ గులాబీ పూవు రీతిగానే బాలలుకూడ అచిరకాలంలో అభివృద్ధికి రావాలని నా కోరిక. ఈ గులాబీల సౌరభ్యంవలెనే. బాలల కీర్తి ప్రతిష్ఠలుకూడ

నలుగడలందు వ్యాపించాలని - నేను బాలలను సదా ఆశీర్వదిస్తాను. మన దేశ బాలలు ఆరీతి కాగలరని ఆశిస్తున్నాను."

ఆహా! చూచితిరా! బాలలపై గల మమకారం! అందుకే ఆయన బాల లందరకు 'చాచా' అయారు.



## 'టెన్సింగు' సమ్మానము

మొదటినుంచి నెహ్రూకు సాహసకార్యాలన్నా, సాహస కార్యాలు చేసిన వీరులన్నా అమితమైన ప్రీతి. అందువల్ల ఎవరెస్టు శిఖరాన్ని ఆరోహించి వచ్చిన టెన్సింగునార్కేను నెహ్రూజీ 1953 లో పిలిపించి, గౌరవించారు.

ఇదే సంవత్సరంలో ఆయన, భారతదేశానికి అతిథిగా బ్రిటిషు మాజీప్రధాని యగు అట్లీని ఆహ్వానించాడు. ఆయన రాగానే నెహ్రూజీ అఖండ స్వాగతమిచ్చి గౌరవించాడు.

ఈ సంవత్సరంలోనే లండన్‌లో ఎలిజబెత్‌రాణి పట్టాభిషేకం జరిగింది. ఆ వేడుకలలో పాల్గొనడానికి నెహ్రూజీ మే నెలలో లండను వెళ్ళివచ్చారు.

## ఆంధ్రరాష్ట్రావతరణ

1953వ సంవత్సరంలోనే భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణంకోసం ఆందోళనం బయలుదేరింది. ఇందుకు మొదట ఒత్తిడి తెచ్చినవారు ఆంధ్రులు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం గురించి నిరాహారదీక్ష వహించి అసువు లర్పించినవీరుడు అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు. ఆయన కాంగ్రెసు కార్యకర్తగా ఉండేవారు. ఆయన త్యాగంతో ఆంధ్రరాష్ట్రం అక్టోబరు 1వ తేదీన లభించింది. దీనికి తొలిమంత్రిగా శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు నియమింపబడ్డారు. తొలి రాజధాని కర్నూలు. ఆంధ్ర ప్రదేశమున తెలంగాణా చేరిన తర్వాత హైద్రాబాదు రాజధానియైనది.







## సోదరీ మణులతో నెహ్రూజీ

నెహ్రూజీ ఈ విధంగా ఊపిరాడని రాజకీయ పరిస్థితుల్లో అల్లాడుచున్నా - గృహంలో మాత్రం పసిపాపలా ఆనందంగా ఉండేవాడు. పెద్దచెల్లెలు విజయలక్ష్మి,

చిన్నచెల్లెలు కృష్ణహథీసింగులతో చిన్నప్పు డెంత చనువుగా ఆడుకొనేవాడో - ఇప్పుడు కూడ అంత ఆనందంతో కాలం గడిపేవాడు. వయస్సున వృద్ధుడైనా, ఇద్దరు చెల్లెండ్రనూ చూచేసరికి, ఆనందంతో పదేండ్లపిల్లవాడిలా అయిపోయేవాడు.

## 1954 - చైనా పర్యటన

1954 సంవత్సరం ఆఖరులో నెహ్రూ చైనాదేశాన్ని దర్శించాడు. మన ప్రధానికి చైనా ప్రధాని చౌ-ఎన్‌లై మరియు మావోలు ఘనస్వాగత మిచ్చారు. (అంతకుముందే చౌ-ఎన్‌లై భారతదేశానికి వచ్చి గౌరవింపబడ్డాడు.) నెహ్రూజీ చైనాదేశం నలుమూలలూ చూచి ఎంతో మెచ్చుకొన్నాడు; నవచైనాను గురించి తన హర్షాన్ని ఇలా ప్రకటించాడు: "మిక్కిలి పురాతనమైన ఈ దేశం, ఈ రోజున కాలానికి అనుగుణ్య పద్ధతులతో నడుస్తూఉంది. చైనీయులు అందరివదనాలలోను ఆనందం తొణికిసలాడుతూ ఉంది. నాగరికత పెంచుకొన్నారు. రాజకీయములందుకూడ అనేక అభివృద్ధికరములగు మార్గములు నిర్మింపబడుతున్నాయి."

## 1955 నెహ్రూజీ సోవియట్ పర్యటన

ఈ సంవత్సరం బాండుంగ్‌లో "ఆసియా ఆఫ్రికాదేశాల మహాసభ జరిగింది, ఈ సభకు నెహ్రూజీ, చౌ-ఎన్‌లైలు ప్రముఖపాత్రలుగా నిలబడ్డారు; ప్రపంచశాంతికై "పంచశీల"లోని సారాంశాన్ని గురించి విపులంగా విశదీకరించారు. ఈ సభకు హాజరైన ఇతరదేశాల వారున్ను, నెహ్రూజీ సూచించి సూత్రాలకు ఆమోదించారు.



ఇదే సంవత్సరంలోనే నెహ్రూజీ సోవియట్ పర్యటనకు బయలుదేరాడు. బుల్గానిన్, కృశ్చేవులను కలిసికొన్నాడు. భారత సోవియట్ దేశాల మధ్య మైత్రిని నెలకొల్పాడు. తరువాత బుల్గానిన్, కృశ్చేవులు భారతదేశానికి వచ్చి, మూడు వారాల

పాటు భారతదేశంలో పర్యటించారు. ఢిల్లీలో సోవియట్ నాయకు లగు బుల్గానిన్, కృశ్చేవులకు జరిపిన సన్మానసభలో నెహ్రూ "సోవియట్ - భారత దేశాలకు గల మైత్రిని గూర్చి విపులంగా మాటలాడారు. ఈ విధంగా సోవియట్ నాయకుల రాకతో ఉభయదేశాల మధ్య గల మైత్రి మఱింత దృఢతరమైంది.



## శాంతి దూత నెహ్రూ-1956



ఈ సంవత్సరమున నెహ్రూజీ జన్మదినోత్సవం చాల వైభవంగా జరిగింది. నెహ్రూజీకు 67 ఏండ్లు వచ్చినవి. ఈ జన్మదినోత్సవ సందర్భంలో నెహ్రూ శాంతి చిహ్నంగా ఒక తెల్ల పావురాన్ని ఎగురవేస్తూ, అప్పటికి భారత - పాకిస్తాన్ దేశాల మధ్య గల భేదాభిప్రాయాలను గూర్చి - ఇలా అన్నాడు.

'పొరుగున ఉన్న పాకిస్తాన్ దేశంవారు నిన్న మొన్నటి వరకు మనతో ఉన్నవారే; మన సోదరులే. ఈ రోజున మనలో మనకు భేదాభిప్రాయాలు కలిగినప్పటికీ అవి ఉభయదేశాలవారు మరచిపోవడం నా యభిమతం. దేశం శాంతితో

ఉండడమే నా కోరిక. ఈ ఉభయదేశాలపట్ల యుద్ధం అనే పైశాచి నృత్యం చేయడం నాకు యిష్టం కాదు. కానీ, ఒకవేళ అట్టి తరుణం దురదృష్టంవల్ల వచ్చిందా ! భారత దేశం ఊరుకోదు. అందుకు మనం అందరం సిద్ధంగా ఉండాలి.''

ఇదే సంవత్సరం ఆయన కామన్వెల్తు మంత్రిమండలి సమావేశానికి లండను వెళ్ళారు. అయిదు వారాల పాటు విదేశాలలో (ఐర్లండు, పశ్చిమ జర్మనీ,



ఫ్రాన్సు, యుగోస్లేవియా, గ్రీసు, ఈజిప్టు, సిరియా, లెబనాన్ మున్నగు దేశాలలో) పర్యటించి వచ్చారు. ఈ సందర్భంలో ఐర్లండు జాతీయ యూనివర్సిటీవారు శ్రీ నెహ్రూకు 'డాక్టర్ ఆఫ్ లాస్' అనే గౌరవపట్టాను బహూకరించారు.

## 1957 - హిందీ సామ్రాజ్యవాదం

ఈ సంవత్సరంలో శ్రీ సి. రాజగోపాలాచారి ఒక ఉద్యమం లేవదీశారు. అది యిది: "భారతదేశంలో హిందీని అధికార భాషగా ప్రవేశపెట్టాలి. ఇందుకు కొంతకాలం పట్టవచ్చు. అయినా 1965 నాటికైనా పూర్తిగా హిందీయే ఉండవలెను. ఇంగ్లీషను తీసివేయవలెను."

ఈ ఒత్తిడి ముఖ్యంగా దక్షిణాదినుండియే ఎక్కువగా కలిగినది. దీనికి నాయకుడు శ్రీ సి. రాజగోపాలాచారి. నెహ్రూ దీనిని ఖండిస్తూ "దీనిని నేను ఒప్పను. ఏండ్లతరబడి ఉన్న ఇంగ్లీషు ఒక్కసారిగా 5, 10 ఏండ్లలో పోవాలంటే చాల కష్టం. నెమ్మదిగా దానంతట అదే తగ్గగలదు. నేనుకూడ ఇంగ్లీషు పక్షపాతినే. కాదనను. అయినను మీ కోర్కె క్రమేణా పోయేలామాత్రం వాగ్దానం చేస్తున్నాను. ఇందుకు మీరింత తీవ్ర ఆందోళనం జరపడం మంచిది కాదు" అని హిందీ సామ్రాజ్యవాదాన్ని శాంతింపజేశాడు.

1958 మార్చి 10వ తేదీన న్యూఢిల్లీలో "భారత వాణిజ్యమండలి 31 వ వార్షికోత్సవం" జరిగింది. (అప్పటికీ భారతదేశ వాణిజ్య శాఖా మాత్యులుగా ఇప్పటి

మన ప్రధానమంత్రి శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి ఉండే వారు.) పై వాణిజ్యమండలి వారి కోరిక ప్రకారం శ్రీ నెహ్రూజీ ఆ వార్షికోత్సవం ప్రారంభిస్తూ 'భారతదేశంలో ప్రైవేట్, పబ్లిక్ రంగాలమధ్య విరుద్ధభావాలేవీ లేవనీ, ఆహార ధాన్యాల వ్యాపారం జాతీయం చేయడం మంచిదనీ, అందు వల్ల భారతదేశ సౌభాగ్యం వృద్ధికాగలదనీ' వెల్లడించాడు.

ఆదేసంవత్సరం శ్రీ నెహ్రూ భూటాన్ వెళ్లి అక్కడి మహా రాజుకు "మీ దేశాభివృద్ధికి భారతదేశం సదా శక్తివంచన లేకుండా సాయపడుతుం"దని వాగ్దానం చేసి వచ్చాడు.



1959-లో శ్రీ నెహ్రూ ఖాట్మాండు దర్శించి అక్కడి వారికి ధైర్యం చెప్పి వచ్చాడు.

ఈ విధంగానే నెహ్రూజీ నేపాల్ రాజగు శ్రీ మహేంద్రకుకూడా, భారత దేశం తోడ్పడగలదని హామీ ఇచ్చి, వారికి ధైర్యం చేకూర్చాడు.

## బాలలతో నెహ్రూజీ



నెహ్రూజీ మూడవసారి ఎన్నిక సందర్భంలో ప్రయాణము చేస్తూండగా ఒక వినోదం జరిగింది. దానిని గమనిస్తే — ఆయనకు బాలలన్నా, బాలక్రీడలన్నా ఎంత మమకారమో మనకు బాగా తెలుస్తుంది.

నెహ్రూజీ ఒక మోటరుపై ప్రయాణం చేస్తున్నాడు. కూడా కొంతమంది నాయకు లున్నారు. మోటరు ఒక గ్రామం చేరింది. ఈ

విషయం ముందుగానే ఆ గ్రామపౌరులకు తెలిసింది కాబోలు! నెహ్రూజీ దారి కడ్డుగా గౌరవించడానికి నిలబడి నారు. ఇక జేసే దేముంది? నెహ్రూ మోటరునుండి దిగాడు. ఆయనతత్వం గ్రహించిన ఆ ఊరిపెద్దలు బాలలచే ఆయనకు సమ్మానం జరిపించారు.

ఇంతలోనే ఒక బెలూన్సు (బుడగలు) అమ్మువాడు అటు పోతూంటే నెహ్రూజీ పిలిచి అవన్నీ తీసికొన్నాడు. (వాటికి తగిన ధరకన్న ఎక్కువ ఇచ్చియే) ఆ బెలూన్లతో కొన్ని నిమిషాలు వినోదంగా చిందులు తొక్కాడు; పిల్ల లందరూ దగ్గరకు మూగగానే ఆయన ఆనందంతో వారికి తలొకటీ ఇచ్చి మోటరు ఎక్కాడు. మోటరు తుర్రు మని పరుగెత్తింది. బాల లందరూ "చాచా నెహ్రూకి జై" అని నినాదాలు చేస్తూ కొంత దూరం వెంబడించారు.

## పుత్రిక ఇందిరాగాంధి; మనుమలు రాజీవ్. సంజయ్‌లతో.

నెహ్రూజీ తన ఏకైక పుత్రికయగు ఇందిరాగాంధికి తల్లిపోయినప్పటినుండి తానే తల్లియై అల్లారుముద్దుగా పెంచుతూ వచ్చాడు. విదేశాలలో చదివించాడు. సంపన్న గృహస్థుల కోడలుగా చేశాడు. ఇందిరాగాంధి భర్తపేరు "ఫిరోజ్‌గాంధి." ఈ దంపతులకు ఇరువురు పుత్రులు. 1. రాజీవ్, 2. సంజయ్ అని వారి పేర్లు. ఫిరోజ్‌గాంధీ మొనమొన్ననే మరణించారు.



ఇందిరాగాంధి భర్తమరణించినప్పటినుండి తండ్రికి మఱింత దగ్గరయింది. రాజకీయాలలో కూడ ఆమె తండ్రికి కుడిభుజమై ప్రకాశించింది. ప్రస్తుతం శ్రీఇందిరా గాంధి - కేంద్ర సమాచారశాఖా మంత్రిణిగా ఉంటున్నారు. పుత్రు లిద్దరు చదువు కొంటున్నారు.



నెహ్రూజీ భారతదేశ సేవను కొనియాడుచూ, రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాదు ఆయనకు "భారతరత్న" అను బిరుదును ప్రసాదించారు — (1955).

## నెహ్రూజీ - చౌ-ఎన్‌లై మావోలతో



చైనాదేశపు అధినేతలగు చౌ-ఎన్‌లై, మావోలు భారత దేశం దర్శించడానికి వచ్చినప్పుడు నెహ్రూజీ వారికి అఖండమైన స్వాగతం యిచ్చాడు. భారతదేశం నలు మూలలు పర్యటించి, వారికి ఆనందం కలిగించేడు. నెహ్రూతోపాటు చౌ-ఎన్‌లై మావోలు కూడ భారతదేశ పర్యటనలో అఖండ సమ్మానాలు పొందారు.



చర్చిల్ దంపతులతో నెహ్రూ

నెహ్రూజీ తన షష్టిపూర్తి మహోత్సవం జరిగిన సంవత్సరం (1949)లో విదేశ పర్యటనకు బయలుదేరాడు. అమెరికా మొదలగు ముఖ్యపట్టణాలలో జరుగుచున్న సభలలో పాల్గొని మాటలాడేడు. అదే పర్యటనలో లండను వెళ్ళి బ్రిటిష్ మాజీప్రధాని యగు చర్చిల్‌కు అతిథిగా ఆయాడు. చర్చిల్, ఆయన సతీమణి - నెహ్రూను అనేక విధాలుగా గౌరవించారు.

# నెహ్రూజీ - గులాబి



నెహ్రూజీకి ఆనందాన్ని కలిగించి, తన్మయత్వంలో ముంచేవి ఒకటి బాలలు; రెండవది గులాబి. బాలల మనస్సులు గులాబీరేకుల వంటి అతి సున్నితమైన వని ఆయన తలంపు. అందువల్లనే ఆయనకు నిర్మల మనస్సులతో అలరారు బాలలన్నా, మృదు మధురములగు సువాసన విచ్చు గులాబీలన్నా అంత ప్రేమ; మమకారమున్ను కలుగుతూ ఉంటుంది.

ఒకసారి నెహ్రూజీ, ఒక మహాసభలో దీర్ఘమైన ఉపన్యాస మిచ్చి ఎంతో అలసిపోయి, చీకాకుగా ఉన్నాడట! ఆయన పొటోను తీసికోవాలని పత్రిక విలేఖరులు

ఫొటోగ్రాఫర్లు ఆయనచుట్టూ తిరుగుతూ ఉన్నారు. కానీ, ఆయన పరిస్థితి చూచి, భయ పడి ఎవరూ దగ్గరకు పోలేకపోయారు. అందులో ఒక తెలివైన విలేఖరి (నెహ్రూజీ తత్వం గ్రహించినవాడన్నమాట!) వెంటనే ఒక అందమైన గులాబీ పుష్పాన్ని సంపా దించుకొని వచ్చాడు. అతడు సాహసించి నెహ్రూజీని సమీపించి, దానిని ఆయన చేతికి అందించాడు. ఇక చూడండి! నెహ్రూజీ ఆనందం!! గులాబీ సువాసన ఆయనకు జవ సత్వాలనుకూడ ప్రసాదిస్తుంది కాబోలు ! పుష్పాన్ని ఆఘ్రాణించగానే ఆయనలో గల అలసత, చీకాకు దూరమయాయి ; మందహాసం ఆయన వదనంపై నాట్యంచేసింది. విలేఖరులు తమ పని ముగించుకొని బైటపడ్డారు.

ఈ సన్నివేశాన్నిబట్టి నెహ్రూజీకి, గులాబీ అంటే ఎంత ప్రేమో మనకు ఇట్టే తెలుస్తుంది.

## పోర్చుగీసు పరాజయము

భారతదేశానికి పరిపాలన అప్పగించి వెళ్ళిపోయినవారు ఇంగ్లీషువారుమాత్రమే కాక, ఫ్రెంచివారుకూడ అట్లే వెళ్ళిపోయారు. కానీ, పోర్చుగీసు వారు నైజాము వలె భీష్మించారు. వలసరాజ్యాలగు 'గోవా, డయ్యూ, డామన్' ప్రదేశాలను 'మా'వని మొండిపట్టు పట్టారు. నెహ్రూజీ శాంతికాముకుడు కాబట్టి తొందరపడలేదు. 14 సంవ త్సరాలు ఓపికపట్టాడు ; పోర్చుగీసువారికి నయాన్ని భయాన్ని హెచ్చరించాడు. కానీ,



వారు సరియైన దారికి రాలేదు. అందువల్ల సైనిక చర్యకు పూనుకోవలసి వచ్చింది. తృటికాలంలో పోర్చుగీసువారు పరాజితు లయారు.

ఈ విషయంలో నెహ్రూజీ – "భారతదేశ మందే కాదు; ఏదేశమందైనా వలస రాజ్యాలు ఉండకూడదు. అవి ఆ యా దేశాలలో కలిసి సుఖించుటయే శ్రేయస్కరం" అని బహిరంగంగా ప్రకటించాడు.

## నెహ్రూజీ - ఆయన రచనలు

నెహ్రూజీ రాజకీయధురంధరునిగానే కాక, ప్రపంచంలో మహారచయితగా కూడ విశ్వవిఖ్యాతి చెందినాడు. ఆయన వ్రాసిన గ్రంథాలలో ముఖ్యంగా మూడు గ్రంథాలు ఎంతో యశస్సు సంపాదించాయి.

*1.* నెహ్రూజీ లేఖలు :- ఇవి తన పుత్రిక ఇందిరాగాంధికి వ్రాసిన లేఖలు. ఆయన జైలులో ఉన్నప్పుడు వ్రాసినవి. ఈ లేఖలలో క్షేమసమాచారములే గాక, ప్రపంచము - దాని చరిత్ర కూడా ఉండేది.

*2. నెహ్రూజీ ఆత్మకథ :-* ఇందు ఆయన అనుభవాలు, స్వాతంత్ర్య సంపాదనకై ఆయన పడిన కష్టసుఖాలు, దేశసేవ మున్నగు విషయాలు పొందుపరచబడ్డాయి.

*3. భారతదర్శనం :-* ఇందులో "భారతీయులు - వారి నాగరకత" అన్న విషయానికి సంబంధించిన విశేషాలెన్నో ఉన్నాయి.

ఇవి యన్నియు నెహ్రూజీ, తన చెఱసాల జీవితములో వ్రాసినవే. ఆయన చెఱసాల కేగకపోయినచో ఈ గ్రంథోత్పత్తి జరగకపోయేదో ఏమో!

## నెహ్రూజీ - ఆయన కృషి

భారతదేశీయుల అదృష్టంవల్ల భగవంతుడు నెహ్రూజీకి అపురూపమైన ఆరోగ్యాన్ని ప్రసాదించాడు. పడుచువారికి కూడా ఉండని శక్తిని, ఓపికను ఆయనకు ప్రసాదించాడు. ప్రతి దినము ఎనిమిది గంటల పని చేయుటకు బాధపడే యువకులు ఈనాడు ఎంతో మంది ఉన్నారు. నెహ్రూజీ ప్రతి దినము 18 గంటలు పనిచేశాడంటే వీరెవరూ నమ్మరు. కానీ, ఆయన ప్రతి దినం 18 గంటలు పనిచేశేవాడు. మిగిలిన 6 గంటలు మాత్రమే ఆయనకు విశ్రాంతి. ఈ స్వల్పకాలమే ఆయన నిద్రగాని; మనుమలతో ఆట గానీ; గృహసంబంధమగు వ్యవహారములు గాని.



రాత్రి పంద్రెండు గంటలయినా, రెండు గంటలయినా సరే — చేతిలో పని అయే వరకు ఆయన లేచేవాడుకాడు. అంతపని ప్రతి రోజూ ఉండేది.



కెనెడీతో నెహ్రూజీ

1961వ సంవత్సరంలో నెహ్రూజీ రాజ్యాంగ విషయాలను గురించి సంప్రదించడానికి అమెరికా వెళ్ళాడు. అప్పటికి అమెరికా అధ్యక్షుడుగా శ్రీ కెనెడీ ఉంటున్నారు. నెహ్రూజీ ఇది నాల్గవసారి అమెరికాకు పోవడం.

మొదటిసారిగా అంటే 1949లో వెళ్ళాడు. అప్పుడు 'ట్రూమన్' అధ్యక్షుడుగా ఉండేవాడు. రెండవసారి నెహ్రూ 1956లో వెళ్ళాడు. అప్పటికి 'ఐసెన్‌హోవర్' అధ్యక్షుడు. (ఈయన చేతిమీదుగా కొలంబియా విశ్వవిద్యాలయంలో నెహ్రూజీకి 1949లో డాక్టరేట్ బిరుదు ఈయబడింది.) మూడవసారి నెహ్రూ 1960లో వెళ్ళాడు ; ఐ.రా.స. సభలో పాల్గొన్నాడు. నాల్గవసారిగా కెనెడీ అధ్యక్షుడుగా ఉన్నప్పుడు (1961లో) వెళ్లాడు. నెహ్రూజీ కెనెడీ కలిసి ఆ దేశంలో పలుచోట్ల పర్యటన చేశారు; అనేక విషయాలను గురించి చర్చించుకొన్నారు.

## చైనా తిరుగుబాటు

భారతదేశం తరఫున నెహ్రూజీ ఐరాస మహాసభలో కమ్యూనిస్టు చైనాకు స్థానం కోసం ఎంతగానో శ్రమపడ్డాడు. (కమ్యూనిస్టుచైనా ఐక్యరాజ్యసమితిలో చేరలేదు) ఇందుకు చైనా భారతదేశం పట్ల కృతజ్ఞత చూపలేదు. పైగా కృతఘ్నతకు దిగింది. భారతదేశంపై దండెత్తి టిబెట్టులో కాలు పెట్టింది. 1954-లో చైనా ప్రధాని చౌఎన్‌లై నెహ్రూకు "మైత్రితో ఉందా"మని హామీఇచ్చి - దారుణమైన కార్యానికి పూనుకొన్నాడు. పాపం! టిబెట్ దేశీయు లగు దలైలామా - వారి అనుచరులు వచ్చి భారతదేశంలో తలదాచుకొన్నారు. నెహ్రూజీ చైనా సల్పిన ఈ దారుణాన్ని సహింపలేక 1959-లో ఇలా ప్రకటించాడు-

"కమ్యూనిస్టుచైనా టిబెట్టువారిపై అక్రమంగా దమననీతిని ప్రయోగించింది. టిబెట్టు వ్యవహారాలలో మనం కలగజేసికోవడం మన ధర్మం. టిబెట్టు భారతదేశాల మధ్య యుగ యుగాలుగా అనురాగాలు పెనవేసికొని యున్నవి. ఇంతమాత్రంచేత చైనావారితో విరోధం పెట్టుకొందామని నా తలంపు కాదు. కాని వీరి దుఃఖం చూడలేక పోతున్నాం" అని తన ఖేదాన్ని వెళ్ళబుచ్చాడు.

మరికొన్ని దినాలకే చైనా - భారతదేశ ఉత్తర సరిహద్దుల్లోకి ప్రవేశించింది. ఈ దెబ్బతో నెహ్రూ సహించలేక యిలా వెల్లడించాడు.

"మన సొత్తును మనం కాపాడుకోవడం మన ధర్మం. మన సరిహద్దులలో కల చిన్నరాజ్యాలు (భూటాన్, సిక్కిం) చాలా భయపడుతూ ఉన్నాయి. వారిని కూడ కాపాడడం మన ధర్మం."

ఆ తరువాత కొద్దిరోజులకు నెహ్రూ చైనాప్రధానికి ఇలా తెలియజేశాడు" మీరు అక్రమచర్యలకు పూనుకొంటున్నారు. లడక్కునుంచీ, నేపాలునుంచీ మీ సేనలు వెనక్కు తిరిగేలా చేయండి లేనినాడు మనలో మనకు (భారత - చైనా సరిహద్దు సమస్య) సంధి కుదురదు."

కానీ, చైనా నెహ్రూజీ వాక్కులకు విలువ కట్టలేదు. ఉన్నట్టు ఉండి 1962 సం॥లో చైనా మనదేశం మీదికి దండెత్తి వచ్చింది. ఈ ఆకస్మిక చైనా దండ యాత్ర గమనించి నెహ్రూజీ అంతటి ధీరుడు కూడ చలించాడు. అయినా, న్యాయ

మార్గాన్ని కార్యం సాధించాలని ఆయన విశ్వప్రయత్నాలు చేశాడు. కానీ, ఆయన కోరిక నెరవేరలేదు.

అందువల్ల భారతదేశ సంరక్షణకై, దేశం నలుమూలల నుండి రక్షణనిధి ఏర్పాటు చేసి నిధిని సేకరించాడు.

తిన్నయింటి వాసాలు లెక్కపెట్టి, దొంగకుక్కలా మీదికి వచ్చిన చైనా దేశాన్ని ఎన్నడూ నమ్మకూడదనీ, తగిన ఆయుధబలం, అంగబలం ఉండాలని - అన్నీ సమకూర్చాడు. ఇందుకు ప్రజలు, ప్రజానాయకులు ఎంతో సహకారు లయారు. కవి కులాపలు పెక్కుమంది ప్రజలలో ఉత్తేజము కలిగిస్తూ - నిధిసేకరణకై - గేయాలు వ్రాసి భారతదేశాన్ని మేల్కొల్పారు. ఈవిధంగా దేశరక్షణకై ప్రజలను ఉత్తేజపరుస్తూ వ్రాసిన గేయాలు రెండు ఇక్కడ పొందుపరచబడ్డాయి.

## ప్రబోధం

సోదరులారా ! వీరుల్లారా ! శూరులైన ఓ యువకుల్లారా !
బందిపోటులౌ చైనాగాళ్ళను మ్రందించుటకై దీక్షబూనుడీ ॥సో॥
ధనికులార ! ఓ దాతల్లారా ! దానశీలురౌ పౌరుల్లారా !
చైనా దుష్టుల రూపుమాపుటకు చేయి చేయి కలపండి - భటులకు
సాయములను చేయండీ ! ॥సో॥

అమ్మలార ! రుద్రమ్మలారా ! ఆదిశక్తి రూపమ్ములారా !
దేశరక్షకై నడుంకట్టి, మీ కాశె బిగించండీ ! - వీరుల
కదనము బంపండీ ! ॥సో॥
మంత్రులార ! దిగ్దంతుల్లారా ! మాతృదేశ సంరక్షకులారా !
తను - ధన - మనముల జన్మభూమికై ధారను బోయండీ - భారత
వీరుల బొగడండీ ! ॥సో॥
జయంబుకోరీ, భయంబువీడీ, చైనా మూర్ఖుల నాశము కోరీ,
పదండి వేగమె, పదండి ముందుకు, పదండి విజయము మనదేను ॥సో॥
పదండి విజయ ధ్వజంబు చేకొని, పదండి దుష్టుల మదంబు మాపగ॥

చైనావారిని తూర్పారబట్టి, వారి కుళ్ళును వెల్లడిస్తూన్న గేయం.

అరే ! చైనా దుర్మార్గా ! హఠో ! ఖబర్దార్ !
కూ్రరమానసా ! ఫోఫో ! పోరా ! గద్దార్ ! !
నరహంతక ! చౌ-ఎన్‌లై ! నమ్మకద్రోహీ !
దురితాత్మా ! చైనాసుర ! ఛూ ! దుర్మోహీ !
నీచుడ ! కుటిలాత్ముడ ! దుర్నీతివి "ఢాకూ";
కాచుకోర మా శక్తికి ; గజిబిజిపడకూ.
రజాకార్ల మఠా రీతి రణరంగమునా
"హజామత్తు" కాగలరు; అరుగుము చీనా.

గర్వంబున నొడలు మఱచి, కన్నుగ్రామి, మా
ఉర్విపైన కాలుమోపితే ? పన్నగమా.
దురితాత్ముల దుర్మార్గుల దుష్టమైత్రిచే
అరయవైతి ముందుచూపు ; అత్యాశలచే.
ఉఱుము ఉఱిమినట్లు ఉఱిమి తరుముదుమోరీ !!
అరయవేమిరా ? వినలేదా ? రణభేరీ.
వీరమాత భరతమాత మాదుతల్లిరా !
ధీరాత్ములు భారతీయ శూరులు గనరా.
తరతరాల మావారల దండి శౌర్యమూ
నరనరాల మాలొ నుండె, సత్యము ; కనుమూ.
కర్మభూమి మా దేశము జన్మభూమిరా !
మర్మము విడనాడి మంచి మతిని పెంచరా !

ఈ విధంగా కవికుమారుల కలాల్లోనుండి ఎన్నో గేయాలు వెలువడ్డాయి: దేశరక్షణకై యువకవీరులు ముందుకు వచ్చి సైన్యంలో చేరారు. స్త్రీదళాలు కూడ ఏర్పడ్డాయంటే వారికి గల మాతృదేశాభిమానం వర్ణింపగలమా !

## నెహ్రూజీ అనారోగ్యం

ఈ విధంగా నెహూ్రజీ రాజకీయ ధురంధరుడై, దేశసేవా తత్పరుడై, భారత రత్నమై, మనకు అంగరక్షకుడై 74 ఏండ్లు శ్రమించాడు. కానీ భారతీయుల దురదృష్టం వల్ల ఆయన ఆకస్మికంగా మృత్యువు వాతకు గురి కావలసి వచ్చింది.

1964 సంవత్సరం నాటికి ఆయన ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. ఈ జనవరి నెలలో భువనేశ్వర్‌లో కాంగ్రెసు మహాసభ జరిగింది. దానిని తిలకించాలని నెహ్రూజీ కోరిక. కాని, ఆయన అనారోగ్యంవల్ల దానిని మానుకోవలసి వచ్చింది.

శ్రీ నెహ్రూజీ తన జీవితకాలంలో వ్యాధి అనేది ఎరుగడట. కానీ, 1964 లో ఆయనకు "వ్యాధి - దాని విపరీత లక్షణాలు" తెలిసివచ్చాయి. అయినప్పటికీ జీవితాశ ఉండేది. ఎవరైనా కావలసినవారు (మిత్రులు) "మీ తదనంతరం పదవీ నిర్వహణకు ఎవరు లభింతురో ఏమో! మీరు ఇప్పుడే నిర్ణయించుట మంచిది" అని అంటే, ఆయన నవ్వుతూ "ఏం! నేనంత తొందరగా చచ్చిపోతానని అనుకుంటున్నారా? నేనింకా చాలా కాలం బ్రతుకుతాను. నా వారసుడుగా భారతదేశానికి సేవ చేయగలిగిన వానిని ఇప్పుడప్పుడే నిర్ణయించ వలసిన సమయం రాలేదు. మీరేమీ భయపడకండి" అని సమాధాన మిచ్చేవాడట.

నెహ్రూజీ అనారోగ్యంతో ఉంటున్నా కార్యదక్షుడగుటవల్ల పార్లమెంటు భవనానికి వెళ్ళడం, సభలలో పాల్గొనడం కూడ జరుగుతూనే ఉండేది. మార్చినెలలో నేపాల్ ప్రభువుతో మాటాడి వచ్చాడుకూడ. ఆ తరువాత బొంబాయిలో జరిగిన "అఖిల భారత జాతీయ మహాసభ"ను కూడ వీక్షించి వచ్చాడు.

కానీ 1964 మే, నాటికి మృత్యుదేవత ఆయనకు తెలియకుండానే ఆయన గృహానికి విచ్చేసింది. 1964 మే, 22వ తారీఖున శ్రీ నెహ్రూ విశ్రాంతికోసం డాక్టర్ల సలహాపై డెహ్రాడూన్ వెళ్ళాడు రెండు రోజు లుండి తిరిగి వచ్చాడు.

మే, 27వ తారీఖు ఉదయం ఎనిమిది గంటలకు శ్రీ నెహ్రూ పరిస్థితి చాల ఆందోళన కలిగించింది. వెంటనే పేరుమోసిన డాక్టర్లందరూ పరుగెత్తుకొని వచ్చారు; ఇంజక్షనులు యిచ్చారు.

## నెహ్రూజీ అంతిమ యాత్ర

ఆయన మంచంచుట్టూ శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి, శ్రీ గుల్జారీలాల్ నందా, శ్రీ టి. టి. కృష్ణమాచారి, ఇందిరాగాంధి మున్నగువారు విచారవదనాలతో ఉన్నారు. జరిగే వైద్యం జరుగుతూనే ఉంది. కానీ 11 గంటలు అయేసరికి భారతరత్న అస్తమించాడు. ఇందిరాగాంధి 'పితాజీ' అని కెవ్వన అరచి పడిపోయింది.

ఈ వార్త పార్లమెంటు సమావేశానికి మంత్రి యగు శ్రీ సుబ్రహ్మణ్యం ద్వారా తెలిసింది. సభ ఆగిపోయింది. అందరూ నెహ్రూ భవనానికి వచ్చేశారు. వాయు వేగంతో ఈ వార్త దేశమంతటా తెలిసిపోయింది. ఢిల్లీలోనే కాక భారతదేశమందంతటా సానుభూతిగా అంగళ్లూ, ప్రభుత్వ కార్యాలయాలు, ఇతరత్రా ఆఫీసులు అన్నీ మూసివేశారు. త్రివర్ణపతాకం సగంవరకు దించబడింది.

నెహ్రూ భవనం ముంగిట ఆయన కొఱకై వేలాది ప్రజలు గుమికూడి, శోకిస్తూ, 'నెహ్రూజీ మృత కళేబరాన్ని ఆఖరుసారిగా చూడాలని' కోరారు. నాయకులు వారి కోర్కెను నెరవేర్చారు.



మన ప్రియతమ నాయకుని కడసారి ఊరేగింపు.

మరునాడు 28వ తేదీని (చూడవలసినవారందరూ చూచాక) మధ్యాహ్నము శ్రీ నెహ్రూ మృత కళేబరానికి గౌరవచిహ్నమైన మర్యాదలతో ఊరేగింపు జరిగింది. రక్షకదళాలు జనసమ్మర్దాన్ని అదుపులోకి తెచ్చాయి. ప్రజలు గుంపు గుంపులుగా నెహ్రూజీ ఊరేగింపులో పాల్గొన్నారు. కొన్ని లక్షల మంది ఆఖరిసారిగ ఆయనను దర్శించి తమ కృతజ్ఞతను వెల్లడించుకొన్నారు.

సాయంకాలం 4 గంటలకు ఆ ఊరేగింపు రాజఘాట్‌కు ఉత్తర దిశలో నున్న స్మశానవాటికకు చేరింది. అప్పటికే అక్కడ కావలసిన వన్నీ సమకూర్చబడ్డాయి. నెహ్రూజీ భౌతికకాయం స్మశానవాటికకు చేరగనే లాంఛనం ప్రకారం కొన్ని ఫిరంగులు మ్రోగాయి. తర్వాత మంచిగంధపు చెక్కలపై నెహ్రూజీని పరుండబెట్టారు. వేద బ్రాహ్మణులు మంత్రోదకములచే నెహ్రూజీ శరీరాన్ని పావనం చేశారు. ఆ సమయంలో నెహ్రూజీ మనుమడు సంజయ్, తాతగారి చితికి నిప్పు



అంటించాడు. నేతితో తడపబడిన మంచిగంధపుచెక్కలుకొట్టి జ్వాలలు మిన్నంటాయి. ప్రజలు, నాయకులు జయనినాదాలు చేశారు. ఇందిరాగాంధి, తన కొడుకుప్రక్కనే నిలబడి కడసారిగా తండ్రికి వందనం చేసింది.

చూస్తుండగానే శ్రీ నెహ్రూజీ మనకు కాకుండా మాయమైపోయాడు. ఆయన భస్మం మాత్రం మనకు మిగిలింది.

'శాంతిదూత'యైన శ్రీ నెహ్రూజీని దహనపఱచిన ఆ స్థలానికి'శాంతిఘాట్' అను పేరు ఉంచారు.

ఈ శాంతిఘాట్‌కు సమీపాన్ని శ్రీ నెహ్రూ పేర "శాంతి వనము" అను పేరుతో ఒక పూదోటను నెలకొల్పాలని నిశ్చయించుకొన్నారు. అందుకు తగిన ప్రయత్నాలు జరుగుతున్నాయి.

మరునాడు శ్రీ నెహ్రూజీ చితాభస్మాన్ని - ఆయన మనుమలు ప్రోగు చేశారు. ఎనిమిది పాత్రలలో దానిని సేకరించారు. ఆ పాత్రలను (చితాభస్మాన్ని) అన్ని ముఖ్యనదుల్లోను కలపడానికి ఆ యా రాష్ట్రాలకు పంపబడ్డాయి. ఇది శ్రీ నెహ్రూజీ అంతిమ కోరిక. ఆయన వీలునామాలో ఈ విషయం ఉందట !

నెహ్రూజీ జన్మస్థానమూ, పవిత్ర పుణ్యస్థలమూ అయిన అలహాబాదుకు ఆయన చితాభస్మం పంపబడింది త్రివేణీ సంగమంపై అప్పటికప్పుడు నవీనమైన వంతెన కట్టి దానిపై, త్రివేణీ సంగం మధ్యకు నాయకులందరూ వెళ్ళారు. శ్రీ నెహ్రూజీ



చితాభస్మాన్ని త్రివేణీ జలాల్లో పునీతం చేశారు. ఈ దృశ్యాన్ని తిలకించుటకు వేలాది ప్రజలు విచ్చేశారు. భారతరత్నానికి ఆఖరి జోహారు లర్పించుకొన్నారు.

శ్రీ నెహ్రూ కోరికప్రకారం - ఆయన భస్మం అన్ని రాష్ట్రాలకు చేరింది. ఆంధ్రరాజధాని హైదరాబాదు పట్టణములో, ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి. తదితర మంత్రిమండలి శ్రీ నెహ్రూజీ చితాభస్మ పాత్రను బేగంపేట విమాన కేంద్రం




నుండి గొప్ప ఊరేగింపుతో పట్టణానికి తీసికొని వచ్చారు ; ముచుకుందానదీ జలాల్లో (సంగంలో) ఆ భస్మాన్ని కలిపారు.

ఇట్లే తదితర రాష్ట్రా లన్నిటియందును ఆ యా రాష్ట్ర మంత్రిపుంగవులు, నాయకులు లాంఛన పూర్వకంగా ఊరేగింపులు జరిపి, చితా భస్మాన్ని అక్కడక్కడ గల పుణ్యనదులలో కలిపి, తమ ధర్మాన్ని నిర్వహించుకొన్నారు.

శ్రీ నెహ్రూజీ ఇంకొక కోరిక కూడ కోరాడట. అదేమిటంటే "తన చితా భస్మాన్ని దేశం నలుమూలలా విరజల్ల మని." అందువల్ల మంత్రిమండలి ఆయన ఆజ్ఞను శిరసా వహించింది. విమానాలపై శ్రీ నెహ్రూజీ చితాభస్మాన్ని దేశం నాల్గు చెరగులా చల్లి వచ్చారు.

భారతదేశ ప్రధానామాత్యుడుగా శ్రీ గుల్జారీలాల్ నందా తాత్కాలికంగా ప్రమాణం స్వీకరించాడు; తరువాత మంత్రిమండలి నిర్ణయం ప్రకారం శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ప్రధానమంత్రి అయారు. ప్రస్తుతం దేశరక్షణభారమంతయు వీరిపై ఆధార పడియున్నది. వీరికి, మిగతా మంత్రిమండలి, నాయకులు, ప్రజలు అండదండగా నిలుచున్నారు.

## మన విధి

భారతరత్నమై, జాతీయ స్వాతంత్ర్య సమర వీరుడై, రాజకీయ ధురంధరుడై, శాంతిదూతయై, దేశసేవాతత్పరుడై, బాలల "చాచా"యై వెలగిన మహామనీషి నెహ్రూజీ యిక మనకు కాకుండా పోయాడు. ఆయన చేతలు మనకు సౌఖ్యాన్ని కలిగిస్తున్నాయి. అతనిని మనసారా స్మరించుకోవడం, ఆయన జన్మదినోత్సవం ఆనదంతో చేసికోవడం మన విధి.

# శ్రీ నెహ్రూజీనిగూర్చి వివిధ దేశాలకుచెందిన ప్రముఖ రాజకీయవేత్తల అభిప్రాయములు

"భారతీయ స్వాతంత్ర్య పోరాటంలో గాంధీజీ తర్వాత అత్యంత ముఖ్యమైనవ్యక్తి శ్రీ నెహ్రూజీ."

— జోసఫ్ బ్రాజ్ టిటో
యుగోస్లావియాఅధ్యక్షుడు.

"నెహ్రూజీ కార్యశూరుడు. తన అభిప్రాయాలకోసం, ఆదర్శంకోసం గట్టిగా పోరాడే దిట్ట."

— గమాల్ అబ్దుల్ నాజర్
ఐక్య అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు.

"మనకు అరుదుగా గోచరించే చారిత్రక మహాపురుషులలో నెహ్రూజీ ఒకడు."

— అబ్దుల్ కరీం ఖాసిమ్
ఇరాక్ ప్రధానమంత్రి.

"శ్రీ నెహ్రూజీ చరిత్ర పరిజ్ఞానంలోనే కాక చారిత్రక తత్వశాస్త్రంలో కూడ దక్షుడు."

— S.W.R.D. బండారునాయకె
సింహళ ప్రధాని.

"స్వాతంత్ర్యంకోసం భారతదేశం జరిపిన పోరాటంలో ప్రముఖ నాయకుడు శ్రీ నెహ్రూ."

— యూనూ
బర్మా మాజీ మంత్రి.

''భారతదేశ నాయకత్వం నెహ్రూవంటి నమ్మకస్తునిపై పడడం నిజంగా ప్రపంచము యొక్క అదృష్టం.''

— లుడ్విగ్ హెర్‌హార్డు
పశ్చిమ జర్మనీ ఆర్థికమంత్రి.

"ప్రాక్పశ్చిమ ఖండాలలో గల అఖండ విజ్ఞానాన్ని మేళవించుకొన్న మేధావంతుడు; న్యాయమూ, స్వాతంత్ర్యమూ, శాంతీ, వాంఛించే న్యాయశీలుడు శ్రీ నెహ్రూజీ.''

— చార్లెస్ మాలిక్
లెబనాన్ మాజీ విదేశాంగ మంత్రి

"భారతదేశం అదృష్టంకొద్దీ జవహర్‌లాల్ నెహ్రూవంటి విశిష్ట వ్యక్తి, సద్గుణశీలి, వివేకవంతుడు నాయకుడుగా లభించాడు."

— లార్డ్ అట్లీ
బ్రిటిషు ప్రధాని

"విజ్ఞానప్రదమైన విద్య, ప్రపంచానుభవం, పరిపాలనాదక్షత గల మేటి వ్యక్తి శ్రీ నెహ్రూజీ.''

— బాసిల్ డేవిడ్ సన్
ఆఫ్రికా వ్యవహారవేత్త.

## నెహ్రూజీ జీవితంలో: ముఖ్య ఘట్టాలు

1889 నవంబరు 14-వ తేదీన శ్రీ నెహ్రూ జననం.

1905 విద్యార్జనకై ఇంగ్లండు ప్రయాణం.

1912 ఇంగ్లండు నుండి భారతదేశానికి వచ్చి న్యాయవాద వృత్తి అవలంబించాడు.

1916 వివాహము.

1917 పుత్రికా (ఇందిరా ప్రియదర్శిని) జననం.

1919 "ఇండిపెండెంటు" పత్రికా నిర్వహణ.

1920 పంజాబు దురంతాలు - రాజకీయ రంగంలో ప్రవేశం.

1921 నాగపూరు కాంగ్రెసు మహాసభలో ఉపన్యాసం, తొలిసారిగా అరెస్టు.

1922 సహాయ నిరాకరణోద్యమంలో రెండవసారిగా జైలుజీవితం. 6 నెలల శిక్ష. ఇదే సంవత్సరం డిశంబరులో మూడవసారి అరెస్టు.

1923 అలహాబాదు మునిసిపాలిటీ అధ్యక్షపదవి మరియు, కాంగ్రెసు మహాసభ కార్యదర్శి పదవి.

1926 భార్య అనారోగ్య కారణంగా స్విట్జర్‌లాండు ప్రయాణం, యూరప్ పర్యటన.

1927 మదరాసు కాంగ్రెసు మహాసభలో ఉపన్యాసం.

1928 లక్నో సైమన్‌కమీషన్ పట్ల నిరసన సూచకంగా నల్లజండాల ఊరేగింపునకు నాయకత్వం.

1929 రాజకీయ మహాసభకు అధ్యక్షపదవి, అదే సంవత్సరం లాహోరు కాంగ్రెసు మహాసభకు అధ్యక్షపదవి.

1930 సహాయ నిరాకరణోద్యమంలో జైలుకేగుట. 6 నెలల శిక్ష.

1931 నెహ్రూజీ విడుదల ; మోతీలాల్(తండ్రి) నిర్యాణం.

1934 బీహారులో భూకంపం, బాధితులకు విరాళాలు సేకరించుట, జైలుశిక్ష.

1935 "ఆత్మకథ" రచించుట.

1936 భార్యా వియోగం.

1938 మాతృ వియోగం.

1939 చైనాపర్యటన, కాంగ్రెసులో నుండి సుభాసుబోసు రాజీనామా.

1940 గాంధీజీ వ్యష్టిసత్యాగ్రహోద్యమం, నెహ్రూజీ ఎనిమిదవసారి జైలుశిక్ష.

1941 పెరల్‌హార్బరుపై జపానుదాడి. నెహ్రూజీ విడుదల.

1942 క్రిప్సురాయబారం; "క్విట్ ఇండియా" భారతీయుల విజృంభణ, నెహ్రూజీ ఆఖరి జైలు శిక్ష 4 సంవత్సరములు.

1944 "భారత దర్శనం" రచన.

1945 విడుదల. భారత జాతీయ నాయకుల విడుదలకై న్యాయవాదిగా నిలుచుట.

1946 భారతదేశానికి తాత్కాలిక ప్రభుత్వం.

1947 భారతదేశ స్వాతంత్ర్యం. ప్రధానమంత్రిగా ప్రమాణ స్వీకరణ.

1948 గాంధీజీ నిర్యాణం. భారతదేశంలో స్వదేశ సంస్థానాలన్నీ చేరుట. హైదరాబాదుపై పోలీసు చర్య.

1949 షష్ఠిపూర్తి మహోత్సవం, కొలంబియా విశ్వవిద్యాలయం వారిచే "డాక్టరేట్" బిరుద ప్రదానం.

1950 భారతదేశం రిపబ్లిక్‌గా అవతరించుట.

1951 జెనీవా, లండన్, పారిస్, కైరా మొదలగు విదేశ పర్యటన.

1952 భారతదేశానికి అరుదెంచిన రూజ్వెల్టు సతీమణికి స్వాగతం.

1953 హైదరాబాదులో జరిగిన 58-వ కాంగ్రెసు మహాసభకు అధ్యక్షపదవి.

1954 కలకత్తా సమీపమున గల "కల్యాణి"నగరంలో జరిగిన 59-వ కాంగ్రెసు మహాసభకు అధ్యక్ష పదవి, భారతదేశానికి వచ్చిన చైనా అధినేత యగు చౌ-ఎన్‌లైకు స్వాగతము. ఆంధ్రరాష్ట్రావతరణ

1955 కామన్వెల్తు ప్రధానమంత్రుల సమావేశానికి లండన్ ప్రయాణం.

1956 సోవియట్ పర్యటన.

1957 చౌ-ఎన్‌లైతో సంభాషణ ; ఆయనతో భారతదేశ పర్యటన.

1958 రాజ్యాంగ వ్యవహారలపై విదేశయాత్ర.

1959 భారత - చైనా సరిహద్దు వివాదంపై చర్చ.

1960 అమెరికా పర్యటన.

1961 అమెరికా అధ్యక్షుడు కెనెడీతో సమావేశం.

1962 చైనా దురాక్రమణ.

1963 భారతదేశ సంరక్షణకై కృషి.

1964 నిర్యాణము.



సంపూర్ణము



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B148 |
| పుస్తకం పేరు | బాలల బొమ్మల నెహ్రూజీ |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | pravallika |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |